## విషయసూచిక

# ఆ ము ఖ ము

"మన ప్రాచీనకళలు - పుట్టు పూర్వోత్తరాలు" అను నీ గ్రంథమును 'ఎల్లోరా' అను నపరనామధేయముతో వ్యవహరించుచూ నీవజకే వర్థమాన వర్తమానాంధ్ర రచయితలలో చేరందిన శ్రీ గొడవర్తి భాస్కరరావు నవ్యాంధ్ర సంస్కృతికి నొక చిన్నికానుకగా నర్పించినాడు. క్రితములో నీ చిరంజీవి మన ప్రాచీనసాహితికి మూలకందమైన జానపద గేయవాఙ్మయమునందు మిగుల పరిశ్రమచేసి యిరువదియైదు సంపుటములుగా సంతరించినాడు. సుమారిరువదియైదు రచనలను గావించినాడు. ప్రస్తుతము ఒక పత్రికకు సంపాదకుడు.

భారతదేశ స్వాతంత్ర్యాభ్యుదయముతో ప్రాంతీయ భాషా సాహితీ సంస్కృతులును నభ్యుదయము నందినవి. అట్టి ప్రాంతీయ సంస్కృతులకు నాటపట్టైన యాంధ్ర సంస్కృతి, అతిప్రాచీనకాలమునుండి యనుపమాన ప్రతిష్ఠ వడసినది. భారతీయసంస్కృతి ప్రపంచమున, ఆంధ్రసంస్కృతి, ప్రత్యేకముగా "ఆంధ్రతాముద్ర"ను నిరూఢము గావించినది. ఈనాడు మన మా ఆంధ్రతావిశిష్టత యెట్లు సక్రమ పరిణామముజెంది వికసించినదో, దానిని తెలుపుట వర్థిష్ణు రచయితల కర్తవ్యంతావశ్యకమైయున్నది. కాని బహుముఖములుగా ప్రవర్తిల్లిన యా సంస్కృతి, కళావిశేషములను, మనము సంపూర్ణముగా నితరులకు నెఱుకపఱచు

టకు, దేశకాల పాత్రానుసారముగా పరివర్తనలయును. ఆ ప్రక్రియ కొంచెము నిరూపింతును.

1. గ్రంథము విసువుపుట్టింపకుండ చదువదగిన పరిమితిలో నుండుట.
2. విషయములను చాలవరకు సంగ్రహించి చెప్పుట.
3. సులభగ్రాహ్యమగు శైలిలోనుండుట.

ఇవి సంగ్రహించిన, 1) గ్రంథ పరిమితి 2) విషయ సంగ్రహణము 3) సులభశైలి—అనుమూడురీతుల నుండును.

ప్రస్తుతగ్రంథము పై మూడురీతులకు నుదాహరణముగా రచితమైనదని ధారాళముగ జెప్పవచ్చును.

గ్రంథపరిమితియంతయు రెండువందలపుటలకు మించ లేదు. ఇందలి విషయములను జూతుము.

1. ఆంధ్రశిల్పకళావైభవము - ఆంధ్రశిల్పుల ఉలికొనల హొయలు.
2. మన నాట్యకళ - సంప్రదాయము.
3. మన వాగ్గేయకారులు - సంగీతము
4. ఆధునికాంధ్ర చిత్రకళ - దానిపుట్టుపూర్వోత్తరాలు.
5. ఆంధ్రనాటకకళారంగము - తెలుగురంగభూమిచరిత్ర.
6. తోలుబొమ్మలు - ఒకనాటి సినీమా.
7. బుర్రకథ- తెలుగువారి ప్రాచీన సంగీతరూపకము.
8. పగటివేషాలు.
9. కొండపల్లి బొమ్మలు.

ఇట్లు తొమ్మిది శీర్షికలలో పందొమ్మిదినందల యేండ్ల నుండి తెలుగునాట వెలయుచున్న, ఆంధ్రశిల్పము-నాట్యము

—సంగీతము—చిత్రలేఖనము—నాటకరంగము—ప్రాచీన సంప్రదాయములు మున్నగువాని చరిత్రను నీ గ్రంథపరిమితిలో నిమిడ్చిన రచయిత సంగ్రహాశక్తి నెంతయు గొనియాడవలసి యున్నది. ప్రాతవిషయములను నవశీర్షికలలో నవనవముగ జెప్పుటయు నిందలి విశేషము.

గ్రంథము యీనాడు, పత్రికాప్రపంచమున నుత్తమ గ్రంథరచనయందు ధారాళముగాసాగుచున్న శిష్టజన వ్యావహారికశైలిని రచితమైనది. ఇక శిల్పమునకు, చిత్రలేఖనమునకు, నాట్యమునకు, చిత్రములుగూడ నుండినగాని, చదువరులమనస్సు నాకర్షింపదు గావున, నవియును నిందు చేర్పబడుటవలన గ్రంథమున కొక సంపూర్ణత్వము చేకూరినది.

ఆంధ్ర శిల్పకళనుగూర్చి మొదటనే పెక్కు విషయములుదాహరింపబడినవి. శిల్పకళ కొక నిలయమైన "ఎల్లోరా" అను పేరే, తనకుపనామముగా స్వీకరించుటచేత, యీ భాగమునందలి రచన "ఎల్లారి" (ఎల్లవారి) ఉల్లములను రంజిల్లజేయగలదు.

ఆంధ్రదేశము దేవాలయశిల్పమునకు లక్ష్యమైన దానిలో విశాఖమండలమునగల సింహాచలక్షేత్రమున నృసింహస్వామిదేవాలయ మొకటియని చెప్పనచ్చును. "జిలుగుకు సింహాచలము – కుదిరకకు కూర్మము" అని కళింగప్రాంతమున వాడుక – నేడీ శిల్పము, మనకు మరుగు పడియున్నను, లోకోత్తరమైన యీ శిల్పనిర్మాణము –

శ్రీకృష్ణదేవరాయాది చక్రవర్తుల నాకర్షించినవి. ఘోరసును కఱకుదనమునుగల బండరాతికి మెత్తదనము. నునుపుదనము గలిగించు *అపామార్గ తైలలేపనవిధానమును నీ శిల్పు లెఱిగి యుండిరి.

ఆంధ్రులు సంగీతకళయందు అగ్రస్థానమునువహించిరి. దీనికి కారణమాంధ్రులు – వేదస్వరోచ్చారణమునకు సిద్ధహస్తులగుటయే. వేదములలో సామవేదము సంగీతమునకు మూలము. అట్టి వేదములను సంపూర్ణముగ కైవసముచేసి కొన్న ఆంధ్రులాకలను సమున్నతముగావించుటలో నాశ్చర్యములేదు. ఇంతియు – అవ్యక్తమధురమైన గానమును సువ్యక్తమధురముచేసినది యాంధ్రులే – దీనికి, ఆజంతమై సంపూర్ణ స్వరవిశిష్టతగలిగిన తెలుగుభాషయే ప్రాతిపదిక – ఇట్టి సన్నివేశముచేత, సంగీత వాఙ్మయము తెలుఁగుభాషలో నున్నంత విస్తృతముగా, మరే యే భాషయందును లేదని ఘంటాపథముగ జెప్పవచ్చును.

---

* మన పూజావిధానములలో పత్రములను, పుష్పములను వివరించుటలో "అపామార్గపత్రం పూజయామి" అని యున్నది. మన పూర్వు లెంత దూరదృష్టితో ఆ పూజావిధానము నేర్పరచిరో, మనకీనాడు స్పష్టము కావు. అపామార్గపత్రపుష్పములతో నొక తైలమును తయారుచేసి, దానిని రాతి పైభాగమున, దట్టముగా లేపనముగావించి మూడు దినములుంచిన నాల్గవదినమున, ఆ రాతికి మెత్తదనము నునుపుదనము గలిగి, యెట్టి సజీవశిల్పమును మలచుటకు అనువగును.

నృత్త గీత వాద్యములు, శివపూజావసరమున నిత్యాంగములగుటచేతను, ప్రాచీనకాలమునుండియు నాంధ్ర దేశమున, నీమూడును నభివృద్ధిజెందినవి. క్రీ. శ. 8వ శతాబ్దిని చాళుక్యభీముని కాలమున "చల్లవ" అను నట్టువరాలు "సమస్త గాంధర్వవిద్యాప్రవీణ" అని పేరొందినది. మహాశైవులైన రెడ్డిరాజులకాలమున, నీ కళ లత్యున్నతస్థితినిం బడసినవి. కుమారగిరిరెడ్డి కాలమున "లకుమాదేవి" వేయిరీతులుగా గీత రసభావములను, వెలయించి ఖ్యాతిగన్నది – రెడ్డిరాజులకాలముననందే. మొదట తెలుగుదేశమున "పారసీనృత్యము" ప్రవేశపెట్టబడినది. దీనికిని, నాట్యశాస్త్రమున చెప్పబడిన మత్తల్లినృత్యమునకు పోలికలుండుటచే, నిది "పారసీక మత్తల్లి"నృత్యమని పేర్కొనబడినది. శ్రీనాథునికాలమున ద్రాక్షారామమున గాంధర్వవిద్యావిశారదలగు స్త్రీలు ఆమనందలమంది యుండెడివారని భీమేశ్వరపురాణముబట్టి తెలియుచున్నది. క్రీడాభిరామమున ఒక పడుచ నాట్యముచేయుచు, తొట్టినీళ్ళలోనున్న ముంగరను, నల్లపూసగ్రుచ్చినవిన్యాస మద్భుతముగా వర్ణితమైనది.

కృష్ణదేవరాయనికాలమున, విజయనగరమున "నాట్యవిద్యామందిర"ముండెడిది. నేడది రూపుమాసినను, దాని వర్ణన, అబ్దుల్ రజాక్ అనునతడు వ్రాసిన గ్రంథమున గలదు. ఈ నాట్యశాలలో, నాట్యశాస్త్రమున వివరింపబడిన భంగిమములన్నియు నేర్చుకొనుట కనువగు విగ్రహములు సంపూర్ణముగా నుండెడివని యాతడు వ్రాసియున్నాడు.

వాద్యములో వీణ ప్రధానమైనది. ప్రాచీనకాలములో నే యే రాగముల కా యా వీణలు ప్రత్యేకముగ నుండెడివి. ఆద్యతనకాలమున వీణావాదనమున - ప్రవీణులు 2 * వీణా వేంకటరమణదాసుగారు. ఏబదెనిమిదేండ్ల క్రిందట వీరు, మదరాసు విశ్వవిద్యాలయ శిష్టసభాభవనమున (Senate) కర్జనుప్రభువు వైస్‌రాయిగానున్న కాలమున, వీణావాద్యము నెఱపిరట! అప్పుడు విశేషముగా గాలి వీచుచుండె నట! రాజ ప్రతినిధియైన కర్జనుప్రభువు తలుపులు మూసి వేయనలసినదని, లేనియెడల వీణాధ్వని వినబడదని చెప్పిరట. కాని వేంకటరమణదాసుగారు, తలుపులు మూయవద్దని చెప్పి, ఆ హోరుగాలిధ్వనినిగూడ మించునట్లు వీణ వాయించిరట! కర్జనుప్రభువులో తక్కినవారును కొంతవడి స్తంభించియుండి, ఆ వెనుక, తిరిగి వీణావాద్యముతోడనే తెలివిగనిరట. అట్టిది వీణావారి వీణవాయిద్యము 3 *

ఇంక, తోలుబొమ్మలు-బుర్రకథలనువానిగూర్చిన వివరణములు చక్కగా నున్నవి. తోలుబొమ్మలవారు బొమ్మలను ప్రదర్శించుచు పాడెడు ద్విపదలు, ద్విపదభారత రంగనాథ రామాయణములలోని ద్విపదలని మనము తెలిసి కొనిన, యీ సంప్రదాయ మచ్చముగా తెలుఁగువారిదని గ్రహింపగలము. తోలుబొమ్మలాటయే చైత్రికవిధానమని భరతనాట్యశాస్త్రమున గలదు.

---

2 * ప్రవీణుఁడనగా — ప్రకృష్టమైన వీణగలవాడని వ్యుత్పత్తి. "ప్రకృష్టః వీణా యస్యసహ ప్రవీణః"

3 * ఈ విషయము — ప్రొఫెసరు సాంబమూర్తిగారు తమ గ్రంథమున తెలిపియున్నారు.

బుఱ్ఱకథలయందు, నాజరు బుఱ్ఱకథను చెప్పు విధానమును ప్రశంసించుట సముచితమైయున్నది. ఇప్పటికి పదునైదేండ్ల క్రిందట క్రీ. శ. 1945లో విక్టోరియా పబ్లిక్‌హాలులో నాజరు బెంగాల్ క్షామము బుఱ్ఱకథ చెప్పినపుడు నేను వినియున్నాను. నా హృదయము కదలి కళ్ళంట నశ్రువులు ప్రవహించినవి. హృదయవిదారకమైన రసవత్సందర్భములను బుఱ్ఱకథారూపమున ప్రపంచించుటలో నాజరునకు నాజరే సాటి, వేఱొకరు లేరు.

ఇంకను, మన మిప్పుడిప్పుడే కొంచెము కొంచెముగా గ్రహించుచున్న మన కళయొక్క పుట్టుపూర్వోత్తరములోని విషయముల నెన్నింటినో, సంకలనము గావించి, మన కుద్బోధముకలిగించిన, రచయితను (ఎల్లోరా) మనఃపూర్వకముగా సంభావించి, ఆత డింకను, నిట్టి జాతీయ విజ్ఞానవికాసహేతువులగు గ్రంథములను రచించుగాక యని యాశీర్వదించుచున్నాను. ఆంధ్రమహాజను లీ గ్రంథము నాదరించి, చదివి, గ్రంథకర్తకు నిరవధికముగ ప్రోత్సాహమొసంగుదురుగాత. మన ప్రగతికి, మన కళ పుట్టుపూర్వోత్తరము తెలిసికొనుట యావశ్యకమనుమాట మఱువకుందురుగాత!

ఇతి శివమ్

చెన్నపురి,
శకము ౧౮౮౧ మాఘ
శు ౩ ఆదివారము.
31—1—1960.

నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.
విద్యారత్న
మద్రాసు విశ్వ విద్యాలయాంధ్ర
భాషాశాఖాధ్యక్షుడు.

# నా మాట

శాతవాహనయుగంనుంచి రాయలయుగంవరకూ వెలుగొందిన కళలను అందివ్వడానికి చాలా పరిశోధన, పరిశీలన, సమయం - అవసరమన్నది అందరెరిగినదే. అంతటి మహత్తర పరిశీలనాగ్రంథాన్ని అందివ్వలేకున్నా - పెద్దల అండతో - క్రితంలో ఆయా శాఖలలో పరిశోధనచేసిన ఎందరో పెద్దల రచనలను చదవగా కలిగిన ఉత్సాహాన్ని ఊతగాతీసుకుని, ఎందరో కవి, పండితమిత్రుల సలహాలను అందుకొని - వారి ప్రోత్సాహంతో "మన ప్రాచీన కళలు - పుట్టుపూర్వోత్తరాలు" అను ఈ చారిత్రక రచనకు సాహసించాను - పూనుకున్నాను.

ఈ రచనకు నన్ను ప్రోత్సహించిన శ్రీ ఆచంట జానకిరామ్, శ్రీ నార్ల వెంకటేశ్వరరావు, శ్రీ తిరుమల రామచంద్ర, డాక్టర్ గిడుగు వెంకట సీతాపతిగార్లకు నా హృదయపూర్వక వందనాలు.

ఎంతో కాలంగా నా రచనావ్యాసంగాన్ని చూసి ప్రోత్సహిస్తూ - నేడు నా యీ గ్రంథానికి తొలిపలుకు వ్రాయడంద్వారా తిలకందిద్ది ఆశీర్వదించిన విద్యారత్న శ్రీ నిడుదవోలు వేంకటరావుగారికి నా నమస్సులు.

అవసరానికి దశావతార నృత్యచిత్రాలను ప్రచురించుకోడానికి సహాయపడిన శ్రీ యమ్. యస్. శైఖాగారికి

శిల్ప, చిత్ర బ్లాకులను కూర్చుకోడానికి సహాయపడిన యితర మిత్రులకు నా వందనాలు.

చక్రపాణి చిత్రాలతో సర్వాంగసుందరంగా గ్రంథాన్ని ముద్రించి - చాలాకాలంగా నన్ను ప్రోత్సహిస్తూన్న మిత్రులు శ్రీ గద్దె లింగయ్య (ఆదర్శ గ్రంథమండలి) గారికి నా వందనాలు.

ఆంధ్రమహాజనులు ఈ నా గ్రంథాన్ని ఆదరించి - మీ అభిమాన రచయిత "ఎల్లోరా"ను ఆశీర్వదిస్తారని నమ్ముతున్నాను.

భవదీయుడు,
"ఎల్లోరా"
(గొడవర్తి భాస్కరరావు)

# ఆంధ్ర శిల్పకళావైభవము

## ఆంధ్ర శిల్పుల ఉలికొనల హాయులు



ఆంధ్రదేశాన్ని సుస్థిరముగ పరిపాలించిన శాతవాహన పరిపాలన క్రీస్తుశకం 3 వ ఏట ప్రారంభమయి 3వ శతాబ్దిలో అంతరించినదనుకొంటాము. ఈమధ్యకాలంలో వెలసిన శిల్పకళావైభవపు చరిత్ర సంతరించుకొనదికాదు శాతవా-హనుల్ని యుగాలకు మార్గదర్శిగా నిలచింది.

శాతవాహనుల అనంతరం – ఇక్ష్వాకులూ, పల్లవులూ, చాళుక్యులూ, కాకతీయులూ, విజయనగరరాజులూ, తంజావూరు రాజులకాలంలో ఎన్నో శిల్పకళాఖండాలు వెలయడానికి దారిచూపింది. శాతవాహనయుగంనుంచి—రాయల యుగంవరకూ జరిగిన శిల్పకళావైభవం సంతరించుకొనదికాదు.

ఆంధ్రసీమను ఆరామసీమగా మార్చిన శిల్పకళా చరిత్రను గురించి తెలుసుకోవాలంటే – మనకు నామమాత్రంగానైనా మిగిలివున్న – ఆంధ్రుల లలితాంతరంగాన్ని దిగ్దిగంతాలకూ చాటిన చిత్రకళా చరమసీమ అయిన అజంతా గుహా శిల్పరాశిలోనూ, ఆంధ్రశిల్పుల ఉలిమొనలగుల జీవిక ప్రతిరూపం అందగి—వాస్తు శిల్పసౌందర్యపు పరిహద్దులను దాటి – పురోగమించి – ప్రతిధ్వనించిన ఎల్లోరా శిల్పసముదాయం, అమరావతీ స్తూపారామాల పుట్టలో జీవకళ ఉట్టిపడే అమరావతీ స్తూపారామాలూ, ప్రపంచ విశ్వవిద్యాలయమై నాగార్జునాచార్యుని ధర్మబోధలకు నిలయమై నిలచిన నాగార్జునకొండ శిల్పరాసీ, యింకా విజయనగర వైభవాన్ని దిగ్దిగంతాలకూ చాటిచెప్పే రాయల గజశాలా, రాతిరథనిర్మాణకౌశలం – ఒకసారి చూస్తేచాలు – ప్రాచీ

నాంధ్రశిల్పకళావైభవము ఎంతటి విశ్వవిఖ్యాతినంది – నేటికీ శిల్పకౌశలంలో – ప్రపంచచరిత్రలో అగ్రతాంబూలాన్నందు కుంటూందో అర్థమౌతుంది.

భారతీయ శిల్పకళ చాలా ప్రాచీనమయిందని చెప్ప డానికి మొహెంజదారో, హరప్పాలలోని శిల్పకళాఖండాల పరిశీలనాచరిత్రే నిరూపణం.

భారత శిల్పసముదాయంలో – ఎన్నో ఒరవడులు ప్రాంతీయంగా మనకు అగుపించినా – హైందవ శిల్పవైశిష్ట్య ప్రధానం మాత్రం మనకు గోచరించక మానదు. ఈదృష్టితో ఒక్కసారి కనుక మనం ఈ శిల్పారామాలను పరిశీలించి నచో బోధపడక పోదు.

అజంతా, ఎల్లోరా, అమరావతి, నాగార్జునకొండ మొదలగు కళాన్వయక్షేత్రసీమలయందు మన శిల్పుల అనాది యుగధర్మ మనోధానములు అడుగడుగునా గన్పట్టును. ఆంధ్రసీమను ఆరామసీమగా మార్చిన ఈ శిల్పచరిత్రను రేఖాన్ని – వరుసగా, శాతవాహనయుగమునీ, ఇక్ష్వాకయుగ మునీ, పల్లవయుగమునీ, కాకతీయయుగమునీ, రాయల యుగమునీ– విభజించుకొని, వరుసగా మన శిల్పచరిత్ర ఎలా ప్రవర్ధమానమై, ప్రపంచ కళాసీమ నేలగలిగిందో పరికిద్దాము.

క్రీస్తుశకము 2లోనో ప్రారంభమయిన శాతవాహన యుగం [illegible]లో అంతమయిందని అనుకొందాము. ఈమధ్య కాలంలో, [illegible] శిల్పప్రతిభ దేదీప్యమానంగా – అమ రావతిలోనూ నాగార్జునస్తూపాలలోనూ –శిల్పకళాలక్ష్మీగృహప్రాంగ ణాన, నిత్యవసంతఋతువుగా వెలుగొందింది. నాటి అమ

రావతీ స్థూపనిర్మాణం తెలుగు శిల్పచరిత్రకు మకుటాయమానమై నిలచింది.

ఈ అమరావతీ స్తూపాలలో - బుద్ధదేవుని జనన వృత్తాంతమూ, ధర్మచక్రపరివర్తనమూ, సంబోధి, మహాపరినిర్వాణము, జాతకకథలూ మొదలగు ఎన్నో ఘట్టములు యిందులో అపూర్వ కళానైపుణ్యంతో చెక్కబడి, కళాలక్ష్మికి ఓంకారం పలుకుతున్నాయి.

అదేకాదు-నాటిసమాజం కళ్ళకుకట్టినట్లు-చరిత్రపరిశోధకులకు కనుపించేలాగ - నాటి సంగీత, సాహిత్య, నృత్యరూపాలను చిత్రించారు. నాటికి తార్కాణంగా రకరకములగు నాట్యభంగిమలూ, నృత్యరూపాలూ, అనేక వింత అయిన వాద్యపరికరాలూ, స్త్రీరూపాలూ, ప్రాణిసంఘాలూ- ఎన్నో చిత్రించారు.

నేటి మన నాట్యసంప్రదాయంకానీ, నాటకరూపంగానీ, నాటికే ప్రచారంలోనున్నట్లు, ఈ చిత్రాల చిత్రణే మనకు తెలియజేస్తూంది. ఇదేసమయంలో రచించబడిన నాట్యశాస్త్రంలోగాడా నృత్య, సంగీత, సాహిత్యకళలను గురించి చెప్పబడింది. శాతవాహనకాలంలో మహాచైత్యస్థితిలో నిర్మితమైన మహాశిల్పకళ ప్రపంచహృదయంలో ఒక ప్రత్యేకస్థానాన్ని ఆక్రమించుకొంది. అంతదాకా ఎందుకు? నేటికీ ఏ ప్రపంచయాత్రికుడు వచ్చినా ఆంధ్రుల ప్రాచీన శిల్పకళారూపాలకు చేతులెత్తి నమస్కరించకుండా వెళ్ళలేడు.

శాతవాహనయుగం అంతరించడంతో ఇక్ష్వాకులు రాజరికవాదులైనారు. వీరికాలంలో బౌద్ధశిల్పాలకు చక్కని ఆదరణ, ప్రోత్సాహం లభించినవి.

దక్షిణ భారతదేశంలోని బౌద్ధుల స్తూపసంపదకు సంబంధించినంతవరకూ, నాగార్జునకొండ మహత్తరమైనది. బుద్ధుని జీవితంలోని అనేక ఘట్టాలూ, జాతకాలూ—ఇక్కడ—విస్తృతానవధిని చిత్రింపబడి వున్నాయి. బుద్ధదేవుని చరిత్ర యింతవిపులంగా శిల్పకృతులను ధరించివున్న ప్రదేశం ఇది మినహా మరొకటి యెక్కడా లేదేమో! ఇక్ష్వాకువంశ ఆంధ్రరాజులు 3వ శతాబ్దిలో కృష్ణానదీ పావనతీరాన తమ పలుకుబడిని నెలయించి ఈ శిల్పఖనిని మనకు వారసత్వంగా అందించి వెళ్ళారు. అమరావతీ ప్రసిద్ధస్తూపంవలెనే, శిల్ప సంపద వెల్లివిరిసిపోయిన నాగార్జునకొండస్తూపాలు ఆంధ్ర జాతికి గర్వకారణమైనట్టివి, స్వర్ణచరిత్రకు నిలయమైనట్టివి.

ఇంతటి పవిత్ర బుద్ధసందేశాలకూ, బుద్ధచరిత్రలకూ నిలయమై, ఈ సమయంలో మహాసౌందర్యసీమగా – విశ్వ బౌద్ధవిశ్వవిద్యాలయ ప్రధాన కేంద్రంగా నిలచింది నాగార్జున కొండ.

నాగార్జునికాలంలో ఘంటసాలలో పెద్ద బౌద్ధారామము ఉండేది. నాగార్జునకొండ శాసనంలో యిది—కంటకశైల సంఘారామముగ పేర్కొనబడింది. క్రీ. శ. మొదటి శతాబ్దంనాటి బౌద్ధస్తూపమొకటి యిక్కడ వుంది. ఇది చాలా చక్కని స్థూపమనీ, ఇంతటి చక్కని స్థూపం దక్షిణదేశంలోనే లేదనీ అంటారు. క్రీ. పూ. మూడవ

శతాబ్దంనాటి కాలభైరవ సరస్వతీ విగ్రహమొకటి వుంది. ఈ విగ్రహం చాలు-ఆంధ్రశిల్పుల శిల్పనైపుణిని అర్థంచేసుకోవడానికి. అందులో ఆంధ్రుల శిల్పచాతుర్యం ఉట్టిపడుతుంది. ఈ శిల్పం మొహంజదారో శిల్పాన్ని పోలివుంటుందని చరిత్రకారుల అంచనా.

ఇక్ష్వాకులరాజధాని అయిన విజయపురి - నాగార్జునకొండవద్దగల శ్రీ పర్వతం 'నల్లరాళ్ళబోడు'కు పడమర దిక్కున ఈ విజయపురి నిర్మాణం జరిగింది. ఈ నిర్మాణం చాలా సహజంగా కనిపిస్తుంది. ఒకవైపు కృష్ణానది, ఒకవైపున కొండలూ వుండటంమూలంగా ఒక కోటలాగా వుంటుంది.

ఇక్కడ ఓ చిన్నవిషయం తెలుసుకోవలసివుంటుంది. నాగార్జునకొండలోని ఆరామం మాత్రమే శాతవాహనుల నిర్మాణమనీ, మిగిలిన ప్రధానశిల్పాలన్నీ ఇక్ష్వాకులకాలంలోనే నిర్మింపబడ్డవనీ అంచనా. అదేకాదు - నాగార్జునకొండలో ఇక్ష్వాకురాజుల జీవితచిత్రాలుకూడా చిత్రించబడినాయి.

అమరావతివలెనే నాగార్జునకొండకూడా గొప్ప విజ్ఞానకేంద్రం.

భారతదేశాన్ని దర్శించవచ్చిన చైనా యాత్రికుని కథనం ప్రకారం నాగార్జునకొండ యిలా వుండేది—

నాగార్జునకొండ అయిదు అంతస్తులు గలిగివుండేది. క్రింది అంతస్తులోనూ, పై అంతస్తులోనూ కలిపిచూస్తే సుమారు ౫౦౦ గదులు వున్నాయని అంచనా.

ఈ అయిదు అంతస్తులూ వేరువేరు ఆకారాలతో నిర్మితములయి వున్నాయట. అందులో మొదటి అంతస్తు ఏనుగ ఆకారంలోనూ, రెండవ అంతస్తు సింహం ఆకారం లోనూ, మూడవ అంతస్తు గుర్రం ఆకారంలోనూ, నాల్గవ అంతస్తు ఎద్దు ఆకారంలోనూ, అయిదవ అంతస్తు పావురం ఆకారంలోనూ వున్నట్లుగా ఆ చైనాయాత్రికుడు పేర్కొన్నాడు.

ఈ నాగార్జునకొండలో చూపరులను ముగ్ధులనుచేసే శిల్పకళాఖండం—నాగరాజు బుద్ధుని ఒకసింహాసనునుండి తన పడగవిప్పి అడ్డుపెట్టి రక్షించుచున్నట్లువున్న చిత్రం. ఈ శిల్పంలో శిల్పకళాప్రతిభ పరాకాష్టనందినదని చెప్పవచ్చు.

ఇక్కడే దగ్గరలోవున్న బెజవాడవైపుకు కూడా ఒక సారి చూద్దాం బెజవాడ ఎన్నోప్రాచీన గాధలకు పుట్టిల్లు.

ఈ బెజవాడలోని కనకదుర్గకొండపైన, మొగల్రాజ పురంలోనూ, గుహాలయాలను తొలిపించినది విష్ణుకుండిన రాజులు.

క్రీ. శ. 5వ శతాబ్దంలో – మొదటి అర్ధభాగంలో శాలంకాయనుల అధికారాన్నంత మొందించి రాజ్యాన్ని హస్తగతంచేసుకొన్నారు విష్ణుకుండినులు.

వీరికి గుంటూరుజిల్లాలోని అమరావతి, పశ్చిమ గోదావరి జిల్లాలోని వేంగి, రెండులూగు ప్రధాన రాజధానీ నగరాలుగావుండేవనీ, అందుతోపాటే విజయవాడ కూడా ప్రధాననగరంగావుండేదనీ తెలుస్తూంది.

ఈ విష్ణుకుండిన రాజులు బౌద్ధమతానికి అన్యాయం చేశారు. బౌద్ధుల దేవాలయాలను శైవ వైష్ణవ దేవాలయాలుగా మార్చి చేశారు. బౌద్ధుల స్థూపాల్లోనే హిందూ గుహాలను తొలిపించారు. ఇంద్రకీలాద్రి, మొగల్రాజపురం గుహాలను తొలిపించినవి వీరే.

ఈ ఇంద్రకీలాద్రినే కనకదుర్గా క్షేత్రాంశాలని పలుకుం గూడా కద్దు. ఇక్కడి గుహాలయాలను అక్కన్న-మాదన్న గుహాలని పిలుస్తూంటారు జనాను. ఈ గుహాలు అక్కన్న, మాదన్న నిర్మించినట్లు ప్రచారంలోవున్నా — వీటిని విష్ణుకుండినులే స్వయముగా నిర్మింపజేసినట్లు చారిత్రకుల బలమయిన అంచనా.

విష్ణుకుండినులకాలంనాటి నాలుగు అంతస్తుల బౌద్ధారామం ఒకటి గుంటూరుజిల్లా ఉండవల్లిలో వుంది.

ఈ గుహాలయం నాలుగు అంతస్తులు గలిగి, అయిదవ అంతస్తు అసంపూర్ణంగా వుంది. దీనిని బౌద్ధగుహాలయమని అంటారు. ఇక్కడ తెలుగులిపిలోవున్న ప్రాచీనకాలపు శాసనాలు వున్నాయి.

తూర్పుగోదావరిజిల్లాలోకూడా కొన్ని బౌద్ధక్షేత్రాలుగా వర్ధిల్లిన ప్రాంతాలు వున్నాయి. క్రీ. పూ. నాల్గవ శతాబ్దంలో నందరాజులక్రింద, తరువాత మౌర్యులక్రిందకు పోయి— శాతవాహనునికాలంలో (క్రీ. పూ. మూడవ శతాబ్దం) శాతవాహనుల రాజ్యభాగమైంది. క్రీ. శ. రెండవ శతాబ్దంలోనూ, నాల్గవశతాబ్దంలోనూ—ఖరవేలుడనే కళింగ రాజు, మహేంద్రుడనేరాజు పిఠాపురం రాజధానిగా జిల్లాను

పరిపాలించారు. ఈ రాజులిద్దరికీమధ్య శాతవాహనులు, ఇక్ష్వాకులూ తూర్పుగోదావరిని కొంతకాలం పరిపాలించారు.

క్రీ. పూ. రెండు మూడు శతాబ్దాలనాటి బౌద్ధస్తూపాలు రాజోలుతాలూకా ఆదుర్రులో కనుగొనబడ్డాయి. ఆకాలపువే అయిన నాణెములూ, మట్టిపాత్రలూ కూడ యిక్కడ కనుగొనబడినాయి.

ఆదుర్రులో దొరికిన ఈ స్తూపాలు మౌర్యులకాలం నాటివో, శాతవాహనులకాలంనాటివో అయివుంటాయని శాస్త్రికారుల నిర్ణయం. తూర్పుగోదావరిజిల్లా ప్రధాన నగరం అయిన రాజమహేంద్రనగరంకు దగ్గరలోవున్న కాపవరం అనేచోట కొండలలో కొన్ని గుహాలువున్నాయి.

ద్రాక్షారామ భీమేశ్వరాలయాన్ని ౧౨వ శతాబ్దివాడైన చాళుక్యభీమరాజు నిర్మించాడని చెపుతారు. ఈ ద్రాక్షారామాన్ని దక్షిణకాశీ అనడం మనకు తెలిసిందే.

ద్రాక్షారామం చెరువునే సప్తసాగరమని అంటారు. చాలా పవిత్రంగా చూస్తారుకూడా. రెండువేలసంవత్సరాల నాటికే ద్రాక్షారామం పుణ్యక్షేత్రమని చరిత్రకారుల నిర్ణయం. అప్పుడు ద్రాక్షారామ-ద్రాక్షారామి అని వుండేదట.

ఇంకోవిషయం - ద్రాక్షారామంకాదనీ, దక్షారామం అనీ అంటారు. దీనికి కారణంగా — దక్షుడున్న స్థలమని అంటారు.

పల్లవ యుగంలో శిల్పపోషణనుగురించికూడా ముఖ్యంగా తెలుసుకోవలసినది చాలావుంది. ఈ యుగం

క్రీ. శ. ౩౩౦లో ప్రారంభమయి ౭౫౦లో అంతమయింది. ఈ పల్లవరాజ్యం మొదట దక్షిణమున కావేరిపెన్నానుండి ఉత్తరమున కృష్ణా, తుంగభద్రలవరకునూ, తూర్పున బంగాళాఖాతమునుండి పడమట బళ్ళారివరకూ వ్యాపించింది.

కంచిలోని కైలాసనాథాలయం, మహాబలిపురంలోని సముద్రతీరాలయం పల్లవ రాజసింహుడు కట్టించినవే.

మహాబలిపురంలోని పాండవుల రథాలనేవి - ధర్మరాజురథం, భీమరథం, అర్జునరథం-వీటిని చూస్తూంటే- రాతిని మలచి యింత బ్రహ్మాండమయిన రథాలు ఎలా నిర్మించారా, చెక్కగలిగారా అని ఆశ్చర్యం కలుగక మానదు.

పల్లవులకాలంలో గొప్ప గొప్ప దేవాలయాలూ, గుహాలయాలూ నిర్మించి శిల్పకళకు చక్కని ప్రోత్సాహం యిచ్చారు. రాయి, యిటుక, సున్నంతో దేవాలయాలు నిర్మించడం పల్లవులతోనే ప్రారంభమని చెప్తారు.

పల్లవులకాలంలో చిత్రలేఖనమూ, సంగీత, సాహిత్యాలూ బాగా వర్ధిల్లినవి. వీటికి పుదుకోట్టలోని-కుడిమియామలైలోని శిలమీద చెక్కించిన సంగీతశాస్త్రసంబంధ శాసనమూ, కైలాసనాథాలయంలో కానవచ్చే వర్ణచిత్రములూ * తార్కాణాలు.

పంచపాండవుల రథాలూ, ఏకశిలారథాలూ ఆంధ్ర శిల్పుల నిర్మాణమేననికూడా కొంతమంది చారిత్రకపరిశోధకులు అంచనాలుకట్టారు.

---

* మల్లంపల్లివారి ఎ. ఐ. ఆర్. 'పల్లవులు' వ్యాసంనుంచి.

అసలు ఈ మహాబలిపురంలో-కన్నులపండువుచేయు ఈ శిల్పనిర్మాణానికి కారకుడు - మొదటి నరసింహవర్మ. ఈ ప్రదేశంలోనే ఒక కొండనుచెక్కిన శిల్పచిత్రములు అతి రమణీయములు. ఈ చిత్రనిర్మాణమునుగురించి రెండు కథలు చెబుతారు.

౧. భగీరథుని తపస్సుకు సంబంధించినకథకు మూలమని.

౨. కిరాతార్జునీయగాథే యిది అని.

మొత్తంమీద యిది ఏ కథకుమూలమైనా పల్లవుల సమయంలో శిల్పకళ యింతటి మహోన్నతకీర్తి నార్జించుకొంది.

శాతవాహనయుగంలో రూపుదిద్దుకొన్న ఆంధ్ర శిల్పకళ పల్లవయుగంలో క్రొత్తరూపు రంగరించుకొని పౌరాణిక ప్రాధాన్యతతో విలసిల్లింది. అంతటి అపురూప కళా శిల్ప రూపాలు అమరావతి, నాగార్జున, మహాబలిపుర శిల్ప రాసులుగా నిలచాయి.

వాటి రూపచ్ఛాయల ప్రతిబింబాలుగా కాకతీయ యుగంలోకూడా తెలుగు శిల్పుల జ్ఞానం పరవళ్ళు త్రొక్కింది.

పరవళ్ళుత్రొక్కడమేకాదు-యింకా పదును దేరింది.

క్రీ. శ. ౧౨౦౦ లో ప్రారంభమయి ౧౩౨౩ లో అంతరించింది కాకతీయయుగం. ఈమధ్యలో వీరి శిల్ప నిర్మాణకౌశలం రానున్న రాయలయుగాన శిల్పకళాదేవతకు స్వాగతం పలికింది - నీరాజనా లెత్తింది. కాకతీయాంధ్ర శిల్ప

నైపుణ్యానికి, సంస్కృతీపటిమకూ రామప్ప దేవాలయం ఒక చక్కని తార్కాణం.

ఆంధ్రదేశంలో నృత్యకళ చాలా ప్రాచీనమయిందనీ, ప్రచారంలోవుండేదనీ మనకు నేటికీ కనుపించే శిల్పరాసుల మీద వుండే నాట్యభంగిమలు సూచిస్తున్నాయి.

అమరావతికి సమకాలీనమయిన, అజంతాలోనూ మనకు ఎన్నో నృత్యశిల్పభంగిమలు అగుపించును. దీనిని బట్టి నాడు నృత్యకళ, చిత్రకళ చాలా మహోచ్ఛస్థితిలో వుండివున్నట్లు సుబోధకం.

ఈ నాట్యశాస్త్రానికి మూలమైనది నందికేశ్వరుని యభినవదర్పణము అని అంటారు.

కాకతీయ గణపతిదేవునియొక్క శానమరది జాయప సేనాని నృత్యరత్నాకరము అను గ్రంథాన్ని రచించినట్లూ-ఆ గ్రంథముచందలి సిద్ధాంతాధారములతోనే రామప్ప దేవాలయంమీది నృత్యభంగిమలు చెక్కబడియున్నట్లునూ మనకు తెలుస్తూంది.

ఆంధ్రశిల్పుల శిల్పనైపుణికి అది ఒక గీటురాయి. రామప్పదేవాలయం ఆంధ్రశిల్పుల స్వర్ణచరిత్రలో ఒక ప్రధానఘట్టం.

శైవమతారాధకులయిన ఈ కాకతీయాంధ్రయుగంలో శిల్పులప్రతిభ అనేక అపురూప-సుందరరూపాలలో-స్వైర విహారంచేసింది. రామప్పగుడి, వరంగల్లు శిల్పములు, హనుమకొండ శిల్పములూ ప్రసిద్ధిపొందిన అపురూప శిల్ప స్వరూపాలు.



వెయ్యిస్థంభాల గుడిలోని సుందర నంది.

వరంగల్లుకోటకు నీరాజనాలు అందించే నందీ, ఏనుగులూ, కాకతీయశిల్ప ఆరాధనకు నిదర్శనాలు.

హయశాల శైలి కాకతీయయుగపు శిల్పశోభను చాటే విజయధ్వజం అంటే చాలు. అంతటి శిల్పచాతుర్యం అందులో పొదిగారు శిల్పులు.

వెయ్యిస్థంభాల దేవాలయం తెలంగాణా మొత్తంలో హిందూ శిల్పకళను చూపే సాటిలేని దేవాలయంగా చెప్పవచ్చు. దీనిని హనుమకొండ సమీపంలోనే గణపతి దేవుడు ౧౧౬౨లో నిర్మించాడు. ఇది మూడుఅడుగుల ఎత్తువున్న అరుగుపైన నిర్మించబడింది. మొదటి ఆలయంలో 300 స్థంభాలూ, మిగిలిన స్థంభాలు రెండవ ఆలయంలోనూ వున్నాయి.



ఓరుగల్లులోని వెయ్యిస్తంభాల దేవాలయం

ఈ దేవాలయం తూర్పునుంచి పడమరకు ౧౦౩ అంగులు, ఉత్తరంనుండి దక్షిణమునకు ౭౩ అంగులూ వున్నది.

వరంగల్లు కాకతీయులకాలంలో ఓరుగల్లు పేరుతో రాజధానినగరంగా ప్రసిద్ధిగాంచినది. ౧౧౬౨ సం.రంలో ప్రతాపరుద్రుడు వెయ్యిస్తంభాల దేవాలయం నిర్మించినది యిక్కడే. గణపతిదేవుడు, రుద్రమదేవి నిర్మించిన వరంగల్లు కోట చాలా చరిత్రప్రసిద్ధిగన్నది.

రామప్ప దేవాలయానికి, హనుమకొండ దేవాలయాలకూ పోలికలున్నాయి.

ఈ రామప్ప దేవాలయం వరంగల్లుకు సుమారు 30మైళ్ళ దూరంలోవున్న పాలెంపేట గ్రామంలోవున్న

రామప్ప చెర్వువద్ద వుంది. యిది అక్కడి అన్ని దేవాలయాల లోకీ చాలా ప్రఖ్యాతినందిన దేవాలయం.

ఇక్కడి దేవాలయాలను గణపతిదేవుడు రుద్రమదేవి కాలంలోనే-అంటే-౧౨౦౦లలోనే నిర్మించారు. దేవాలయ శిల్పకళలో యిది తలమానికమయినదని కొనియాడబడింది.

ఇక్కడవున్న దేవాలయాలలో ఉత్తమ శిల్పకళలో నిర్మించినవికూడా వున్నాయి. కాకతీయరాజులకాలంనాటి అపురూపమైన చారిత్రకచిహ్నాలలో ఈ వరంగల్లు దుర్గం ప్రధానమయినది. ఇది హనుమకొండకు ౫ మైళ్ళదూరమున కలదు. కాజీపేటనుంచి అయితే ౧౦ మైళ్ళదూరం వుంటుంది.

దీనిని ఒక్కసారిగా ఒక్కరే పూర్తిచేయడం జరగ లేదు. కాకతీయరాజు అయిన గణపతిదేవుడు ౧౧౯౯లో ప్రారంభించగా - ఆతడికూతురు రుద్రమదేవి ౧౨౬౧లో పూర్తిచేసింది. ఈదుర్గానికి రెండుగోడలున్నాయి. వెలుపలి గోడ మట్టితో, లోపలిగోడ రాతితో నిర్మితమయివున్నవి. వెలుపలిగోడను ఆనుకొనే ఒకకందకం వుంది. వరంగల్లుకు దూరాన మూడవగోడకూడావున్న చిహ్నాలువున్నాయి. ఈ కోటకు నాలుగు ద్వారాలు వున్నాయి. కాని రెండే ఉపయోగించబడుతున్నాయి. ఈ ద్వారానికి రెండుప్రక్కల రాతిసింహాలు వున్నాయి.

కాకతీయయుగంలో-కాకతీయరాజులక్రింద యింతటి శిల్పకళానిర్మాణం జరిగింది.



వరంగల్ కోటలో విజయతోరణం.

కాకతీయుల హయాంశాల శిల్పసౌందర్యచరిత్రనూ, రామప్ప దేవాలయ శిల్పపనితనమునూ పుణికి పుచ్చుకుని- రాయలయుగంలో శిల్పకళ ఆంధ్రను ఆవాససీమగా నిల చింది - నాటి రాయలయుగపు ఆదరణచే.

రాయలయుగం - క్రీ. శ. ౧౫౧౦ ఆ ప్రాంతంలో ప్రారంభమయి, ౧౫౬౫ తో అంతమయింది.

ఈసమయంలో సంగీత, సాహిత్య కళలతో పాటు - శిల్పకళాపోషణకూడా చాలా గొప్పగా జరిగింది. శిల్పకళా పునరుద్ధరణ చాలా చక్కగా జరిగింది.

విజయనగర కళాఖండాలలో ప్రపంచవిఖ్యాతిగన్న నాగార్జునకొండ అనుకృతులూ, అమరావతీరూపకల్పనా విశేషాలూ కొంచం గోచరించక మానవు.

ఈ అపురూపకళాఖండాలనైపుణిని పుణికిపుచ్చుకుని వెలసినవే - రాయలయుగంలో శిల్పఖండాలు.

దీనికి తార్కాణంగా గజశాల, విరూపాక్షరథం, ఉగ్రనరసింహమూర్తి, విరూపాక్షస్వామి — రూపాలలో శిల్పిగాంభీర్యం మనకు - ఎల్లోరా, అమరావతి, నాగార్జున, మహాబలిపురములలోని శిల్పలాలిత్యము యిందులో కన బడుతుంది.

ఇవన్నీ మన ఆంధ్రశిల్పుల శిల్పకళానైపుణ్యానికీ, ఆంధ్రరాజుల శిల్పకళాపోషణా పటిమకూ తార్కాణాలే కదా !

బొజ్జన్నకొండ అని ఒక కొండవుంది. దీనిని తొలిచే ఒక బౌద్ధగుహాలయం, ఆరామమూ నిర్మించబడ్డాయి - ఈ బొజ్జన్న కొండనే మహార్నవమిదిబ్బ అంటారేమో !

ఈ బౌద్ధగుహాలయంలో రెండు అంతస్తులున్నాయి. దానిమెట్లు శిథిలావస్థలో వున్నాయి. యిందులో ధ్యాన ముద్రలోవున్న బుద్ధవిగ్రహం వుంది. ఈ ఆలయం మధ్య లోనే నాలుగు అడుగుల బౌద్ధస్తూపం ఒకటివుంది. పై అంత స్తులోని ఆలయంలో పద్మాసనంలోవున్న పెద్ద బుద్ధుని విగ్రహం వుంది.

బొజ్జన్నకొండ అని పిలువబడే ఈ కొండ అనేక చిన్నకొండల సముదాయం. ప్రతి సంక్రాంతికి ఇక్కడ ఉత్సవాలు జరుగుతాయి.

దసరాకాలంలో రాజులు యిక్కడ కొలువుచేయడానికి చిత్రమైన శిల్పకళలతో నిర్మించిన మండపం వుంది. ఇక్కడ కూర్చుండి - తమ దర్బారుకై వచ్చిన సామంతులనూ పండితులనూ, యితర విద్వాంసులనూ కలుసుకొనేవారట.

ఈ దిబ్బకు దసరా దిబ్బ అని పేరు రావడానికి కారణం- దసరాసమయంలో ఆ దిబ్బపై అలంకారనిర్మితమయిన చోట ఆసీనులై దసరా నవరాత్రి ఉత్సవాలను చూసేవారట. అందుకే ఈ దిబ్బకు మహార్నవమి దిబ్బ అని నామం వచ్చిందని అంటారు.

ప్రతిసంవత్సరం శంకరంలో సంక్రాంతికి ఉత్సవాలు జరుపబడుతూ వుంటాయి. అక్కడిప్రజలు వారివారి గొడ్లను తోలుకునివెళ్ళి బొజ్జన్నకొండక్రిందిఅంతస్తులో వున్న స్తూపం చుట్టూ ఎనిమిదిసార్లు ప్రదక్షిణం చేయించుతారు. ఇది ఒక పాతనమ్మకం.

అదేకాదు - ఈకొండయందే ఈరినమ్మ అనే దేవత వుంది. ప్రతిప్రాంతంలోనూ ఒక్కొక్కదేవత అక్కడి ప్రజలకు ఆరాధ్యదేవతగా వుంటుంది.

పోలేరమ్మ ఒకరికి దేవతైతే, గంగానమ్మ మరొకరి దేవత. మారిడమ్మ ఒకరిదేవతఐతే, అంకాలమ్మ మరొకరి దేవత. అలాగే యిక్కడివారికి ఈరినమ్మ దేవత. ఈమె

పిల్లలను తినేసేదని అక్కడివారిలో ఒక పాతనమ్మకం - ప్రచారంలో వుంది.

అందుకు ఆమెచేసే ఈ పిల్లలను తినడం అనేపనికి కోపంతో... ఈ ఉత్సవాలకు వచ్చిన స్త్రీలు తలఒకరాయీ ఈ దేవతమీద గిరవాటేసి మరీ వెడుతుంటారు. అందుకే అనుకుంటా ఈ ఈరినమ్మ దేవత రాళ్ళలో మునిగివుంటుంది.

విజయనగరంతాలూకాలో రామతీర్థమతిఅని మరో బౌద్ధక్షేత్రం వుంది. ఇది జైన క్షేత్రంకూడా. రామతీర్థాన్ని ఆరామతీర్థం అనికూడా అంటారు. రామతీర్థం జైన, బౌద్ధ మతాలకు కేంద్రంగా వుండేది.

రాజులు రావచ్చు, పోవచ్చు; రాజ్యాలు ఒకరిచేతి నుంచి మరొకరిచేతికి మారవచ్చు. కాలక్రమంలో సూర్యాస్త మయాలు తప్పవుకదా!

కాని, ఆ యా యుగపుడియల్లో నిర్మితములయిన ఆ యా కళాఖండాలు మాత్రం తెలుగు శిల్పకళాభారతికి శిరో భూషణాలై - ఆంధ్రులకూ, ఆంధ్రశిల్పులకూ విశ్వవిఖ్యాతి చేకూర్చిపెట్టాయి కదా.

రాయలు, అప్పాజీల కథలలో చెప్పబడుకథలు అన్నీ- కృష్ణదేవరాయనీ, అతనిమంత్రి తిమ్మరుసునీ గురించినవే. దేవాలయాలకు వీరలు చేసిన కైంకర్యాలూ, యిచ్చిన దానాలూ లెక్కలేనివి.

కాంచీపురం, చిదంబరం మొదలగుచోట్ల పెద్దవైన, ప్రసిద్ధములైన గోపురాలు కట్టించారు. ఆనంద నిలయం అను తిరుపతి విమానానికి బంగారుపూతపూయించింది వీరలే.

ఊరిమధ్యభాగంలో మాతంగగిరి వుంది. ఆ కొండపై నిలిచి ఒకతూరి నాలుగు దిక్కులా పరికిస్తే – మనకు అగుపించేది – ఒకవెంపున కోటలు, బురుజులూ, ఒకవెంపు ఆలయగోపురాలూ, వేరొక వెంపు ముస్లిందండయాత్రకు గురిఅయిన రాయల శిల్పరాశినిచూసి ప్రకృతి కంటనీరు పెట్టిందా అన్నట్లు ప్రక్కనే ప్రవహించు తుంగభద్రమ్మా మనకు కనుపించి, మనలనుకూడా ఓసారి—ఆ దృశ్యాలు జలదరింప జేస్తాయి.

హంపిలోనే విరూపాక్ష దేవాలయం వుంది. దాని నానుకొనే హేమకూటమను ఒక పెద్దరాతిబండ వుంది. ఈ బండపైన జైన దేవాలయాలు వున్నాయి.

దీని సమీపానే ఒకమండపం, ముందుగా వినాయక విగ్రహం వున్నాయి. ఆ విగ్రహం ౨౦ అడుగుల ఎత్తు వుంటుంది. ఈ విగ్రహానికే – శనగగింజవినాయకుడని పేరు.

ఇక ప్రపంచ విఖ్యాతి గడించి ఆంధ్రశిల్పుల నిర్మాణ కౌశల్యానికి అమరకీర్తిని తెచ్చిన – అజంతా, ఎల్లోరా గుహాల సౌందర్యచరిత్రను చూదాం.

ప్రతి జాతికీ గర్వించదగ్గ చరిత్ర కొంత వుంటుంది. అతను మావాడని, అది మాదని, ఆ రాగం, ఆ కట్టు,

ఆ కృతి మావని గర్వంగా జాతీయాభిమానంతో చెప్పు కొనేవి ప్రతిప్రాంతీయులకూ వుంటాయి.

కర్ణాటక సంగీతం మా సొత్తు అని తమిళులు అంటే-హిందూస్థానీ మా ఆరాధ్యకళ అని ఒకరు అంటే-త్యాగయ్య మావాడు, ప్రాచీన యక్షగానాలు మా ప్రాచీన సంపద, పవిత్ర నదీనుతల్లులకు మా గడ్డ నోచుకుంది, శిల్పంలో నేము అగ్రగణ్యులమని జబ్బచరచి చెప్పగలిగిన ప్రాచీన శిల్పకళా చరిత్ర మనది అని చెప్పకోదగ్గ స్వర్ణచరిత్ర వుంది.

మణిపురి మా సొత్తని ఒకరు అంటే, కథకళి మాది చూడండని మరొకరంటే, భరతశాస్త్రం అసలు మాదని వేరొకరంటే - మాకూ వుందని కూచిపూడినృత్యాన్ని చూసి సవాలుపలికి ఆనందంతో ఉప్పొంగి - ఆంధ్రులుగా చెప్పు కుంటున్నాము.

కాని ఒకవిషయం - ఒకపద్ధతిలో ఒకరు ప్రాధాన్యం కలిగివుండవచ్చు. మనం - అమరావతి, నాగార్జున మొదలైనవి బుద్ధచరిత్రతో పవిత్రమయి - శిల్పకళాలక్ష్మి ఓయని పలికే శిల్పకళాఖండాలు మాకు వున్నాయంటే—

ఏ తమిళసోదరులో మాకూవుంది చూడండి మహాబలిపుర శిల్పశోభ అనవచ్చు. మా మహారాష్ట్రంలో మాకూవున్నాయి చూడండి అజంతా, ఎల్లోరా శిల్పాలు అని వారూ అనవచ్చు.

కాని ఒక్కటి-అటు మహారాష్ట్రంలోచేరిన అజంతా, ఎల్లోరాలనుకాని, యిటు తమిళదేశపుమహాబలిపుర శిల్పాలు

కాని చెక్కింది ఎవరు – ఆ శిల్పాలు ఎవరు? ఆ శిల్పకళలు ఎవరిసొత్తు? అని ప్రశ్నిస్తే – అటు అజంతా, ఎల్లోరా కానివ్వండి, యిటు మహాబలిపురశిల్పాలు కానీండి – అజంతా తెలుగన్నలు – ఆంధ్రశిల్పుల ప్రతిభావిశేషకీర్తి శిల్ప కళాచరిత్రే – అదిమాత్రం నిజం. అటువంటి పవిత్రచరిత్ర కలిగి, మన తెలుగుశిల్పుల కళాప్రతిభకు తార్కాణాలుగా నిలచిన అజంతా, ఎల్లోరాలనుగురించి కొంచెం తెలుసు కుందాము.

ఈ అజంతా గుహాలు ప్రస్తుతం మహారాష్ట్రల సొత్తుగావున్నాయి. మొన్నమొన్నటివరకు• హైదరాబాదుకు చెందివుండేవి. ఈ అజంతాగుహాలు చిత్రకళా సమన్వితములు. ఎల్లోరా గుహాలు శిలాశిల్పసమన్వితములు. అటు అజంతా, యిటు ఎల్లోరాలు రెండూ బౌద్ధచరిత్రకు నిలయముతే – రెండింటిలోనూ బుద్ధచరిత్రను చూడగలం.

వీటిని బౌద్ధభిక్షువులు నాకు ప్రధానకేంద్రాలుగా ఎన్నుకొనడానికి కారణం – దగ్గరలో ' నదులువుండడమే అనుకుంటూ – దీనికి తార్కాణంగా నాగార్జున, అమరావతి కృష్ణానదిని ఆనుకొనే నిర్మించుకున్నారు.

ఈ అజంతా గుహాలలోకి వెలుతురు ఎక్కువగా రాదు – ఎల్లోరా గుహాలలాగ. అజంతా సందర్శనానికి ఔరంగాబాదునుంచి సుమారు అరువదిమైళ్లు పయనించాలి. ఎల్లోరా ఔరంగాబాదుకు సుమారు ౧౬ మైళ్ళలోనేవుంది. ఈ ఎల్లోరా కొండలలో 3౪ గుహాలు చెక్కబడ్డాయి. ఈ

గుహలు అన్నీ ఒకే మతానికి, సిద్ధాంతానికి లోబడి చెక్కబడలేదు. ఇందులో కొన్ని పౌరాణికతకు చెందీ, మరికొన్ని బౌద్ధానికి చెందీ, మరికొన్ని జైనమతానికి చెందీ వున్నాయి.

ఈ ఎల్లోరా గుహల శిల్పములలో ప్రత్యేకంగా చెప్పవలసిందీ - చూడవలసిందీ కైలాసనాథ దేవాలయ శిల్పం. ఈ శిల్పం మొత్తానికే ఒక శిరోభూషణం అనవలసి వుంటుంది. దీనిని చూడడానికి ఎంతసమయమూ చాలదు. ఎంతచూసినా తనివితీరనట్లే వుంటుంది. చూసిన శిల్పాన్ని వదలి ముందుకు వెళ్ళలేము. యింకా, యింకా ఏదో పరికిద్దామని, ఆ శిల్పలాలిత్యం మనలను నిలవేసి ఆకర్షిస్తుంది. ఇదే ఈ శిల్పారాశిలోవున్న గొప్పప్రత్యేకత.

ఈ కైలాసనాథ దేవాలయ శిల్పంలో కైలాసచరిత్ర అంతయూ చిత్రించారు నాటి శిల్పాచార్యులు. చూడగా, చూడగా ఈ శిల్పాలను మలచినవారు మానవమాత్రులేనా - లేక ఏ దేవతలా అన్న అనుమానం మనకు కలుగుతుంది. ఇంతటిఅపురూప శిల్పకళాఖండాలను-అంతంత రాతికొండలను- అతుకులు లేకుండానే-ఎలా దొలచి అంత సౌందర్యంగా, వాస్తు శిల్ప పద్ధతిలో ఎలా నిర్మించారా అనిపిస్తుంది. వీటిని నిర్మించడానికి ఆ శిల్పులు ఎంతకాలం తీసుకున్నారో, ఎంతటి కళాతపస్సుచేశారో, ఇంతటి అపురూప శిల్పాలను చెక్కినా వారి నామాలనుకూడా ఒక్కచోటునైనా వ్రాసుకోలేదంటే వారిత్యాగం మనకు గోచరించక మానదు.

కైలాసనాథదేవాలయం - కొండను, ఏనుగులమీద నిలచియున్నట్లు నిర్మించబడింది. ఈ ఆలయగోడల మీద ఎన్నో చెక్కడాలు చెక్కబడియున్నాయి.

రామాయణగాథ. విష్ణ్వవతారాలు, శివలీలలు - ఇందలి అత్యద్భుతములు.

త్రిపురసుందరి విగ్రహం, గంగావతరణ సందర్భ మొదలగు రూపాలు కళ్ళకు కట్టినట్లు నాటి చరిత్రను చూపిస్తూ వుంటాయి.

ఈనాటికీ ఈ కళాఖండాలు నిగనిగలాడుతూ, నిత్య నూతనంగా వున్నాయంటే, నాటి ఆంధ్రశిల్పుల ప్రతిభ ఎంతటిదో గమనార్హం.

ఇంతటి అపురూపకళాక్షేత్రాన్ని నిర్మించి - ఆంధ్ర శిల్పకళాప్రతిభను ప్రపంచానికి చాటినారు - వారెంతటి ధన్యులో!

ఔరంగాబాదునుంచి ౬౦ మైళ్ళు ప్రయాణంచేస్తే, అజంతాగ్రామం చేరుకుంటాం. ఈ అజంతా అనునది చిన్న గ్రామం. దీని నానుకొనే ౫, ౬ మైళ్ళదూరంలో అజంతా గుహలు వున్నాయి. ఔరంగాబాద్‌నుంచి అజంతాకు వెడుతూంటే - అక్కడి ప్రకృతిసౌందర్యం మనలను ముగ్ధులను చేస్తుంది. కొండలు, అడవులతో అంతా రామణీయకంగా వుంటుంది. ఈ ప్రదేశమునకే ప్రవహించుచున్నది వాఘోరా నది.

ఆ కొండలూ, అచ్చటచ్చటి పల్లములూ, అడవులూ, వాటిమధ్య ప్రవహించే వాఘీరా - చూడవలెనే గాని - ఆ ప్రకృతిరామణీయకతనుగురించి రాయడంకష్టమే.

అజంతాగుహాలయాలు చిత్రకళాసమన్వితాలు. కాని, నాటి చిత్రకళ చాలాభాగం చెరిగిపోయింది. కొన్నింటిలో నేటికీ చిత్రకళ మనం చూడగలం. అజంతా శిల్పాచార్యులు రెండువేల ఏళ్ళక్రితం - అంతటి కళానైపుణ్యాన్ని ఎలా చూపకలిగారో! ఆ శిల్పాకృతులలో యిప్పటికీ కొత్తదనం, శిల్పనైపుణ్యం కనుమరుగవక - నిత్యనూతనంగా - కళకళలాడుతూ కనబడుతూంటాయి.

ఆ యా చిత్రాలకు తగిన రూపభేదం, వర్ణమేళనము, భావలావణ్యము, రేఖావిన్యాసములు సహజసుందరములు.

ఇక్కడనే ఫోక్ ఆర్ట్ అనీ, మోడరన్ ఆర్ట్ అనీ నేడు పేర్కొనబడుతూన్న - చిత్రకళ - రెండువేల యేళ్ళక్రితమే -- ఈ శిల్పాల్లో మనం చూడనగును. దానికి తార్కాణంగా—నాలుగు జింకల కొక తల వున్న చిత్రమూ, రెండు లేళ్ళకు ఒకేతల—లాంటివి గమనార్హము.

గర్భాలయంలోని బుద్ధదేవుని పరికించిన -ఎదుటనుంచి పరికించిన కోపంగానూ, ప్రక్కనుంచిచూస్తే నవ్వుతున్నట్లూ కనిపించును.

తూర్పుగోదావరిజిల్లా ర్యాలిలో వున్న జగన్మోహినీ విగ్రహం యిక్కడ జ్ఞాపకంవస్తుంది. చాళుక్యులకాలంలో నిర్మించబడిన ఈ జగన్మోహినీ విగ్రహం ముందునుంచిచూస్తే

ఆంధ్రదేశాన్ని సుభిక్షముగ పరిపాలించిన ఆంధ్రరాజ వంశాలలో శాతవాహనులు మొదటివారు. వీరు క్రీస్తు పూర్వం మూడవశతాబ్దిలో ఆంధ్రదేశాన్ని పరిపాలించినట్లు చరిత్ర నిరూపణ.

అప్పటికే ఆంధ్రదేశంలో – సంగీత, నాట్య, వినోద కళలు ప్రచారంలోవున్నట్లు కనిపిస్తుంది.

హాలుడు రచించిన గాథాసప్తశతిలోకూడా నృత్య, సంగీత, వినోదాల ప్రసక్తి మెండుగా కనిపిస్తుంది.

శాతవాహనుల అనంతరం పల్లవులు, చాళుక్యులు, కాకతీయులూ, విజయనగరరాజులూ, తంజావూరురాజులూ ఈ కళలను పోషించారనుటలో సందేహంలేదు. నాటి నుంచి నేటిదాకా ప్రజాదరణ, రాజాదరణ అందుతూ, సజీవ కళగా నిలచినవి మూడు కనుపిస్తున్నాయి. అవి: ఒకటి – యక్షగానాలు, రెండు–కూచిపూడి భరతనాట్యం, మూడు–తోలుబొమ్మల ప్రదర్శనాలు.

ఈ తోలుబొమ్మలప్రదర్శన పండిత పామరులలో వినోదాన్ని కలిగిస్తూ మన్ననలందుకొంది. అలాగే కురవంజి, యక్షగాన, కూచిపూడి ప్రదర్శనాలు కూడా.

ఈ కళలు ౧౨వ శతాబ్దంలో చాలా ప్రచారంలో వున్నట్లుకూడా మన మూహింపనచ్చును. పన్నెండవశతాబ్ది వాడైన పాల్కురికి సోమనాథుడు రచించిన పండితారాధ్య చరిత్రలో...

"భ్రమరులు జాళెముల్ బయనముల్ మెరసి
రమణ పంచాంగ పేరణి యాడువారు
ప్రిమథ పురాతన పటు చరిత్రములు
క్రియ మెఱుంగ బహు నాటకములాడువారు
లలితాంగరసకళాలంకార రేఖ లలనడ
బహురూప మాడెడువారు
అమరాంగనలు దివి నాడెడు మాడ్కి
సమరంగగడలపై నాడెడువారు
అవియద్గతి యక్షులాడెడు నట్టి
భావన ప్రమోకులపై నాడువారు.
భారతాది కథలు చీరమరగు
నారంగ బొమ్మల నాడించువారు
కడు నద్భుతంబుగ గంధసూత్రంబు
లడరంగ బొమ్మల నాడించువారు
నారట గంధర్వ యక్ష విద్యాధ
రాదులై పాత్రల నాడించువారు"—

అని కళ్ళకుకట్టినట్లుగా సవివరంగా వర్ణించినాడు పాల్కురికి సోమనాథుడు.

ఈ ప్రాచీన కళాఖండాలకు — కూచిపూడి నృత్య భారతికి నిలయమైతే, — బొమ్మలాటపల్లి లాటిప్రదేశాలు తోలుబొమ్మలకు నిలయమయ్యాయి. యక్షగానకళకు తంజావూరు నిలయమైతే — కురవంజికి నాడు దక్షిణభారతంలోని ప్రసిద్ధ యాత్రాకేంద్రాలయిన శ్రీశైలం, తిరుపతి నిలయమయ్యాయి.

కూచిపూడి భాగవతుల వృత్తి మూలపురుషులు బ్రాహ్మణు లయితే, తోలుబొమ్మల ప్రదర్శనానికి మూలపురుషులు బొందిలీ క్షత్రియులు.

కూచిపూడి యక్షగానానికి మూలపురుషులు తెలుగు వారైతే, తోలుబొమ్మల ప్రదర్శనాలకు మూలపురుషులు మహారాష్ట్రులు. యక్షగానకళాలక్ష్మికి సింహాసనమెత్తించిన తంజావూరు రాజులు.

తోలుబొమ్మల ప్రదర్శనాలు తెలుగునాటనే ప్రారంభ మనీ, రానురాను కాలాంతరములచేత నాను సలబాని ప్రాంతాలకు వలస వెళ్ళాయనీ చెబుతారు — ఒక పద్ధతిని.

ఇక రెండవది. అసలు ఈ తోలుబొమ్మల పుట్టుక మహారాష్ట్రదేశంలో అని. నాడు మహారాష్ట్రదేశం వదిలి తెలుగుభూమిపై స్థిరపడ్డారని బలమయిన తార్కాణంగా చెబుతారు - అందుకు ఎన్నో ఉదాహరణలు చూపుతారు. అందులో ముఖ్యంగా, వారు మాట్లాడే భాష మరాఠీ, వారి నామధేయాలు మహారాష్ట్ర పరిహాద్దనని, వారి రూపు రేఖా విలాసాలూ అందుకు దగ్గరగానే వుంటాయనీ చెబుతారు. మొత్తంమీద వీరు మహారాష్ట్రులే అని అనుమానం కలుగకపోదు. ఈనాటికీ తెలుగునాడున తోలుబొమ్మల ప్రదర్శకులు మాట్లాడేభాష మరాఠీయే, కాని పశ్చిమగోదావరిజిల్లాప్రాంతంలో ఒక తోలుబొమ్మలప్రదర్శనసంఘం తెలుగు మాట్లాడడం కద్దు.

కూచిపూడి భామకలాపం చెప్పేవారికి సంస్కృతం కొద్దోగొప్పో వచ్చివుంటుంది. అవసరంకూడా. అలాగే ఈ తోలుబొమ్మలవారికి కొంచం ఛోక్కశుద్ధి, వాక్శుద్ధి కావాలి; వుంటుందికూడా. ప్రదర్శనంమధ్యలో అమరకోశం లాంటివాటినుంచి కొన్ని సంస్కృతశ్లోకాలను ఇత్యమరః అంటూ వల్లిస్తూంటారు.

నేటి సినిమాలకు దారిచూపింది నాటి ఈ తోలు బొమ్మల ప్రదర్శనలే. నేడంటే సినిమాలు వచ్చాయికాని - నాడు తోలుబొమ్మలప్రదర్శనమే ఒక సినిమా. ఒక్కమాటలో చెప్పాలంటే — ఒకనాటి సినిమా - నేటి తోలు బొమ్మలు అంటే సరిపోతుందనుకుంటాను.

## నృత్యభారతినిలయం - కూచిపూడి.

మణిపురి, కథకళి నృత్యాలకువలెనే కూచిపూడి నృత్యానికీ ఒక ప్రత్యేకత వుంది. కథకళి అక్కడ జాతీయ తని ప్రతిబింబించినట్లే - మణిపురి అక్కడి జాతీయతని నిరూపించినట్లే - తంజావూరునృత్యం వారి జాతీయతను నిరూపించినట్లే - కూచిపూడి భరతనాట్యం, వారి భామ కలాపం, దశావతారనృత్యాలు - తెలుగు నృత్యభారతి ప్రతిభను చాటుతాయి - తెలుగు జాతీయతకు ప్రతిబింబా లవుతాయి.

అన్ని జాతులకువలెనే తెలుగుజాతికి ఒక ప్రత్యేకత వుంది. అన్ని భాషలకువలెనె తెలుగుభాషకు ఓ ప్రత్యేకత వుంది. 'దేశభాషలందు తెలుగు లెస్స' అన్నారనుకోండి.

ఇతర కళలకున్నట్లే నాట్యకళకూ పూర్వచరిత్ర, విలువ, గౌరవం వున్నాయి.

తెలుగువారి ప్రాచీనచరిత్ర చాలా విలువయినది. భారతీయనాగరికతకే తెలుగువారు మూలపురుషులన్నారు ఒకరు. తెలుగువారు రాజ్యాలు ఏలారు, రాజ్యాలు సాధించారు, యుద్ధాలు చేశారు. దేశాంతర వర్తకం చేశారు. చరిత్రను సృష్టించారు.

తెలుగుపంచె, తెలుగుకలం, కాశీ, కొంగు - అన్నీ ప్రత్యేకస్థానాన్ని అందుకున్నాయి.

తెలుగు అన్నలు చెక్కిన స్తూపారామాలకు ఏం లోటులేదు; తెలుగు కవి కలం చిందించిన కవితాస్రవంతి, అందు వికసించిన కలువలూ ఏం తక్కువవికావు; తెలుగు నేలను సుక్షేత్రాలుగాచేసిన తెలుగు రైతుచేతి కాడిని ఏం తక్కువ అంచనావెయ్యనక్కరలేదు. నాడు కవికి ఎంత గౌరవముందో రైతుకూ సంఘంలో అంతే గౌరవంవుందన్న సత్యం పోతన్నగారే చెప్పారు.

"......య ప్పుడుపుకూడు
భుజించుట కంటె సత్కవుల్
హాలికులైన నేమి?......" అన్నారు.

తెలుగువారికంఠం - సంగీతదృష్ట్యా - సప్తస్వరాలు హాయలుగా పలికించి - కిలకిలలవాకిట వసంతలక్ష్మిని నింపి - వీణానిక్వణాలకు ముక్కుత్రాళ్ళువేసిన లయబ్రహ్మ త్యాగయ్య మన తెలుగువాడు. త్యాగయ్యనీ, త్యాగరాజ

కీర్తనలనీ తమిళులు భుక్తంచేసుకున్నారనుకోండి. అంతటి ప్రాచీనచరిత్ర, అంతటి స్వర్ణచరిత్ర తెలుగుజాతికి వుంది.

దానంలో - ధర్మంలో, పౌరుషంలో, శాంతివాంఛలో, జాతీయతలో-స్వతంత్రేచ్ఛలో, కట్టులో, బొట్టులో, బాటలో - మాటలో, పాటలో - ఆటలో తెలుగువారికి ఒక ప్రత్యేకత వుంది.

ఈయన తెలుగువాడు అనగలిగిన బట్టకట్టు మనకు వుంది. ఈమె తెలుగుఆడబడుచు అనగలిగిన అలంకారాలు తెలుగుస్త్రీకి వున్నాయి. ఇలాగే ఈ కళ మాది, ఈ నృత్యం మాది అని చెప్పగలిగిన నృత్యసంప్రదాయం తెలుగుజాతికి వుంది.

ఎన్నో నూతన సంప్రదాయాలూ, మార్పులూ వచ్చినా, కాలం మారినా, అనుకరణలకు లొంగక, తన ప్రాచీన ఆచారకట్టుబొట్లను నిలుపుకుంటూ నిలచిన కళలు మూడు. ఒకటి - తోలుబొమ్మలప్రదర్శనం. రెండు - యక్షగానరూపనాటకాలు. మూడు - కూచిపూడి భరతనాట్యం.

ఈ కూచిపూడి ఈనాటికీ తెలుగునృత్యభారతికి నిలయం. అదేకాదు - కూచిపూడి ఆంధ్రుల నృత్యవిశ్వవిద్యాలయం.

నేటివరకూ యివి నిలద్రొక్కుకుని నిలిచాయంటే గర్వించదగ్గ విషయమే. ఏదైతే ప్రజాదరణ పొందుతుందో అది యుగయుగాలు సజీవచైతన్యంతో నిలుస్తుందని మనం అనుకోవాలి.

క్రీస్తుపూర్వం ౧౫౦౦–౧౦౦౦ల మధ్య మహాభారత యుద్ధం జరిగింది. ఆ మహాసమరంలో కూడా ఆంధ్రులపాత్ర వుంది. ఆంధ్రులవలెనే నాగులూ, యక్షులూ కూడా చాలా పురాతనజాతివారే.

యక్షుల ప్రాచీన గీతాలే యక్షగానాలనుకుంటాను. అలాగే కురవంజినృత్యం కూడా చాలా ప్రాచీనమయినది. చాలా ప్రాచీననృత్యం క్రిందకే వస్తుంది నాగనృత్యం.

బెంగాలులోలాగా తెలుగువారికి అందరూ—స్త్రీలూ, పురుషులూ — కలిసి పండుగలకు నృత్యంచేసే ఆచారంలేదు. బెంగాలులో గర్భనృత్యంఅని అందరూ కలిసిచేస్తారు. ఇది చక్కని ఆనందపూరితమైన జానపదనృత్యం.

నాగజాతివారు మొదటినుంచీ విలక్షణమయినభావాలను కలిగుండి వారి ప్రత్యేకతలను నిలుపుకోజూసినట్లు కనిపిస్తుంది. ఆంధ్రులుకూడా రకరకాలుగా – ప్రస్థానయాత్ర సాగిస్తూ – ప్రత్యేకతలను నిలుపుకొంటూ – నిరంకుశపరిపాలకులను ఎదిరిస్తూ – చివరకు పోరాటాలు సల్పి – రాజ్యాలు జయించి పాలకులు అయ్యారు. తెలుగుభాషనీ, సంస్కృతినీ, కళలనీ పెంపొందించుకున్నారు. తెలుగుదేశాన్ని – సంగీత నృత్య, చిత్రలేఖన కళలతో ఆరామసీమగా తీర్చిదిద్దుకున్నారు. నాటినుంచి నేటిదాకా ఆంధ్రులు తమప్రత్యేకతలను నిలుపుకుంటూ జాతీయగౌరవాన్ని అందుకుంటూనే వున్నారు.

మొత్తంమీద చూస్తే - భారతదేశంలో తెలుగు సంస్కృతికి వున్నంత విలువ, గౌరవం మరెవరికీ లేవనే చెప్పవలసి యుంటుంది. సుప్రసిద్ధ పురాతత్వ శాస్త్రజ్ఞులు జాయింట్ డైరెక్టర్ ఆఫ్ ఆర్కియాలజీ, (భారతప్రభుత్వం) టి. ఎన్. రామచంద్రన్‌గారన్నట్లు—భారతీయ నాగరికతకే మెరుగులు దిద్దింది తెలుగుసంస్కృతి. దీనికి అనుమానం అనవసరం. దీనికి తార్కాణంగా అమరావతీ స్తూపారామా లను చూపి స్థేచాలు అనుకొంటాను.

అమరావతి స్తూపారామాల చిత్రకళలదృష్ట్యా ప్రపంచ విఖ్యాతిబడసిన ఆంధ్రులచరిత్ర, కూచిపూడి నృత్యకళాలక్ష్మి ద్వారా చరిత్రసృష్టించుకున్న ఆంధ్రజాతి, తోలుబొమ్మలూ మొదలగు ప్రాచీన కళలద్వారా ఖండాంతరాలలోకూడా ఆంధ్రసంస్కృతికి లభించిన గౌరవ ప్రతిష్ఠలు, ఈనాటికీ ఆంధ్రులు గర్వించదగ్గ స్వర్ణచరిత్రగా - చరిత్రపుటలలో అరుణారుణమై ప్రకాశిస్తూంది.

సరే. ఇదంతా గర్వించదగ్గ విషయమే, కాని,- నేడు ఈ కళలు ఎంతవరకూ ఆదరించబడుతున్నాయనేదే నేటి ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానం ఒక్కటే – అది – మాట ల్లోనేకాని, చేతల్లో ఈ కళలకు నేడు ఆదరణ, పోషణలేదు.

అయితే మన ప్రాచీన కళాఖండాలు యిలా నిరాదర ణతో రానురాను కనుమరుగై పోవలసిందేనా ? అనుకరణ కళారూపాలు మన నెత్తినఎక్కి తాండవంసలుపవలసిందేనా?

దీనికి ఎవరికివారు సమాధానం చెప్పుకోవాలి. ఇది ఏ ఒక్కరి విషయం కాదు. జాతి ఉమ్మడిసమస్య. జాతి చరిత్రకు వెన్నెముక. దేముడిపెళ్ళికి అందరూ బాధ్యులే, పెద్దలే, కర్తలే. ఇక్కడ ఒక ప్రశ్న ఉదయించవచ్చును – నృత్య విశారదులయిన తాండవకృష్ణగారో, నటరాజ రామకృష్ణ గారో లేదా, ఏ శైవాగారో చూసుకోవలసిన సంగతి యిది – అని.

దేవుడూ, అర్చకులూ, భక్తులమధ్య ఎలాటి సంబంధం, బాంధవ్యం వుందో – అలాటి సంబంధమే యిక్కడా వర్తిస్తుంది.

ఈ కళలు దేవతాస్వరూపాలు అనుకుందాము–నాటి అర్చకులు నృత్యకళాచక్రవర్తులు అవుతారు. మానే మనం ఆరాధకులమన్నమాట.

ఈ ఆశయంతో, ఆరాధనాభావనతో, విశ్వభావనాపురో గమనపథాల వెంట మనం యాత్ర సాగించాలి. విజ్ఞాన, వైజ్ఞానిక యాత్రకు ఆఖరిమైలురాయి అంటూలేదు. వీటి పునస్సిద్ధరణకు ప్రతి తెలుగుహృదయం కంకణంకట్టుకోవాలి– తెలుగు కళావాణి చేతులలోని వీణాక్వణం ప్రపంచహృదయంలో ప్రతిధ్వనింపజేయాలి.

## ఆంధ్రుల నృత్య విశ్వవిద్యాలయం—కూచిపూడిప్రాచీనగాథ

"కృష్ణా ముకుందా మురారే
జయ
కృష్ణా ముకుందా మురారే..."

అన్న కృష్ణపరమాత్మధ్యానపరమైన కీర్తన వినని తెలుగుహృదయం వుండదు. ఆ కీర్తనా మధురిమకు పరవళ్లు తొక్కని తెలుగుగుండె అరుదు.

ఆ కీర్తనని గానంచేసుకుంటూ కృష్ణానదీతీరంవెంట ఒక మహానుభావుడు, యోగిపుంగవుడు—ఎచటికో వెడుతున్నాడు.

ఆ కీర్తనాలాలిత్యానికి, అందలి భక్తిపారవశ్యతకు కృష్ణవేణమ్మ తన ఆనందాన్ని చూపటానికా అన్నట్లు చిరు కెరటాలద్వారా చిందులాడుతూంది; పచ్చిక చిరుగాలిలో తన్మయత్వంలో మునిగిందా అన్నట్లు—అటూ ఇటూ వూగిస లాడుతూంది; ఆకాశాన పక్షిసమూహం రెక్కలువిప్పుకొని విహరిస్తూ మహానుభావుని భక్తిపూరిత సంగీతగానమాధురికి నీరాజనాలు అర్పిస్తూందా అన్నట్లు కిలకిలారవాలతో విహంగమార్గాన విహరిస్తున్నాయి; గోమందలు ఒక్క సారిగా తలలు పైకెత్తి తమరాధామాధవునికి పరమైన గానం చెవినిపడగానే ఆనందంతో ఉప్పొంగి, హృదయాంజలులు ఘటిస్తున్నాయా అన్నట్లు గంగడోళ్ళ గంటలు గణగణనినా దాలతో ప్రతిధ్వనిస్తున్నాయి.

కుహూకుహూరాగాల తేలియాడే మత్తకోకిలగాన రాగ డోలికలలో ఊయలలూగే సంగీతసుధాహృదయుడా అన్నట్లు ఎవరో ఒకబాలుడు గోగణాన్ని తోలుకుంటూ, పచ్చికను చీల్చుకుంటూ—ఏదో తన్మయత్వంతో — ఎక్కడికో చూపులనూ—చెవులనూ సారించి ముందుకు వెడుతున్నాడు. రాను

రాను దగ్గరగా — యింకా దగ్గరగా — చెవులలో గింగుర మంటూ — వసంతఋతువును హృదయసీమలో జ్ఞాపకం చేస్తోంది—

"కృష్ణా ముకుందా మురారే
జయ
కృష్ణా ముకుందా మురారే..."
అంటూ.

ఎదురుగుండా ఓ పరబ్రహ్మస్వరూపుడు - నాదేశ్వర పినాకపాణంలాగ ప్రతిధ్వనించే కంఠధ్వనితో కళాకాంతి నిలయమా అన్నట్లు నిగనిగమెరుస్తూ మురిపిస్తూన్న నేత్రద్వయంతో ప్రత్యక్షమయాడు. చూశాడు ఆ బాలుడు - ప్రత్యక్ష దేవదర్శనంలాగా. తన్మయుడైపోయాడు ఆ సమయంలో ఆ బాలుడు.

నమస్కారం మహానుభావా - అంటూ ఆ మహానుభావుని పాదాలను తాకి - ఆశీస్సులర్థించాడు.

ఆ కుర్రవాని రూపురేఖావిలాసాలూ, నమ్రతా చూచిన ఆ యోగిపుంగవునికి ఆ సమయంలో - ఆ ప్రదేశంలో - ఏదో కళాజ్యోతి తళుక్కుమంది. ఈ గడ్డ నృత్యకళానిలయానికి తగినదనుకున్నాడు - తను ఆశించిన కళాసరస్వతికి యిదే తగినచోటు అని నిర్ధారణచేసుకున్నాడు.

తన పవిత్రహస్తద్వయంతో, నిండుపున్నమిలాంటి కళాహృదయంతో—నృత్యకళారాధనకు పూనుకొమ్మని, ఈ ప్రదేశమే నృత్యభారతీనిలయమౌనని-ఆశీర్వదించాడు ఆయన.

ఆయనే జగత్ ప్రఖ్యాతిగాంచిన ఆంధ్ర నృత్య సంప్రదాయానికి మూలపురుషుడు సిద్ధేంద్రయోగి.

ఆ ప్రదేశమే – దక్షిణాపథంలో భరతశాస్త్రప్రమాణంగా వికసించిన – నృత్యకళారాధనకు ఆదర్శకళాతపస్వులను అర్పించిన నృత్యభారతి కళాక్షేత్రం కూచిపూడి. అదే ఆంధ్రుల నృత్యవిశ్వవిద్యాలయ ప్రధాన కేంద్రం అయిన కూచిపూడి.

ఆ సమయమే – మొగల్‌సామ్రాజ్యం మూడు పూవులూ ఆరుకాయలూ కలిగి – మహోన్నత స్థితిలోవున్న సమయం. మన సంగీత, సాహిత్య, నృత్యకళాభారతి చైతన్యంతో – నవనవోన్మేషంగా పెంపొందుతున్న సమయం అది. అదే మొగల్ సామ్రాజ్యలక్ష్మి ఢిల్లీ రాజ్యరమను అధిష్టించి పరిపాలిస్తూన్న పవిత్ర సమయం. నాటిదే ఈ కూచిపూడి బృహత్కథ. ఆ సిద్ధేంద్రయోగి రచించినదే పారిజాతాపహరణం.

భరతముని చెప్పిన శాస్త్రపద్ధతులలో భావ, రాగ తాళయుక్తమైన శాస్త్రకట్టుబాటుతో – చక్కగా అభివృద్ధిపరచిన నృత్యకళను – ఆంధ్రలోనేకాదు; తమిళ, మళయాళ దేశములందేకాదు సరికదా, దేశాంతరములయిన – జావా, బోర్నియో, సుమత్రి, సయాం, కంబోడియా మొదలగు దేశాలలో కళాభిరుచిని కలిగించి ఆ దేశాలను కళామయం చేశారు మన తెలుగు నర్తకులు.

కూచిపూడి సంప్రదాయసిద్ధమైన భామాకలాపం. గొల్లకలాపం. దశావతారనృత్యం. మొదలగువాటిలో తర్ఫీదునందినవారు తెలుగుదేశంలో చాలామంది కనుపిస్తారు - శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి. వేదాంతం రాఘవయ్య, చినా, తాండవకృష్ణ, నటరాజ రామకృష్ణ, సత్యం, జగన్నాథ్ - మొదలుగాగలవారు.

ఈ కూచిపూడి భాగవతాన్ని నేటికి క్రొత్తరూపం దిద్దింది శ్రీ వేదాంతం రామకృష్ణయ్యగారు.

ఈ కూచిపూడి భాగోతులు మొదట ఒక్క భామకలాపాన్నే చెబుతూవచ్చినా, తరువాత - ప్రహ్లాదనాటకం, ఆ తర్వాత తర్వాత - ఉషాపరిణయం, హరిశ్చంద్ర - మొదలగునవి ప్రదర్శించసాగారు.

ఈ కూచిపూడి భరతనాట్యానికి ప్రధానులుగా ఈ శతాబ్దంలో పేర్కొనవలసినవారు ముగ్గురు - శ్రీయుతులు వేదాంతం లక్ష్మీనారాయణ, వెంపటి వెంకటనారాయణ, చింతా వెంకట్రామయ్యగారలు.

అలాగే తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి జిల్లాలలో కళావంతులయిన స్త్రీలు ఎందరో కూచిపూడి భామకలాపాన్ని - చక్కని శాస్త్రపద్ధతిలో ప్రదర్శించగలిగినవారు వున్నారు - అన్నాబత్తుల చిట్టి మొదలగువారు.

అదేకాదు - ఢిల్లీ సింహాసనాన్ని షాజహాను అధిష్ఠించినరోజులు అని - అప్పటికథ వినండి.

భారత సారస్వతాకాశంలో ధృవతారగా పేరొందిన జగన్నాథ పండితరాయలు కోనసీమ బ్రాహ్మణుడు. ఆయన తండ్రి వేదపండితుడైన పేరిభట్టు. పేరిభట్టు తండ్రి—అంటే పండితరాయని తాత – కేశవభట్టు. ఆయన కూచిపూడి సంప్రదాయానికి చెందిన భరతవిద్యలో ఆరితేరినవాడని చెప్తారు.

ఈ కేశవభట్టుగారే కూచిపూడి భరతవిద్యను – కృష్ణ దేవరాయని ఆస్థానంలో ప్రదర్శించి – ముంగండను అగ్రహారంగా పొందినట్లు చారిత్రక గాథ.

ఆ రోజులలో కూచిపూడినృత్యం నేర్చినవారిని వెలివేయడం పరిపాటేనన్న సంగతి అందరకూ తెలిసిందే. అలాగే కేశవభట్టుకుటుంబాన్ని వెలివేసి నానా అగచాట్ల పాలూచేశారని చెప్తారు.

ఇంతకూ అసలు చెప్పొచ్చేది—రాజాధిరాజులను ముగ్ధులను చేసి – అగ్రహారాలు అందుకున్న కళ ఈ కూచి పూడి నృత్యకళ అనే.

ఒకనాడు మహారాజులచేత ప్రజలచేత నీరాజనాలు పట్టించుకున్న ఈ కళ రానురాను ఈనాడు కనుమరుగైపోయే పరిస్థితికి రావడం చాలా విచారించదగ్గ విషయం.

## ఏకపాత్రాభినయం నుంచి బహుపాత్రాభినయం వరకు.

ఏ చరిత్రనయినా పరిశీలించాలన్నా, పరిశోధించా లన్నా –వెనుకకు ఒకసారి చూడకతప్పదు. అలా మనం

మన ప్రాచీనకళాస్వరూపాలు ఏమిటా అని వెనుకకు చూసి నప్పుడు కూచిపూడి భరతనాట్యం, తోలుబొమ్మల ప్రదర్శనాలూ, యక్షగాన నాటకాలూ మనకు కనిపిస్తాయి. క్రీస్తు పూర్వమే ఈ కళలు నిత్యకళ్యాణం పచ్చతోరణంగా - సజీవ చైతన్యంతో - తేజోవంతమయి తెలుగునాట మూడు పూవులూ, ఆరుకాయలుగా విజయయాత్ర సల్పినవని మనకు అర్థమవుతుంది.

మన దేశీయ నాటకకళగా పేర్కొనదగిన యక్షగానాలలాగే, కూచిపూడి నృత్యకళకూ, తోలుబొమ్మల కళకూ చాలా వయస్సు వుంది.

యక్షగాన మనగా యక్షులకు సంబంధించిన గానం కాబట్టి యక్షగానం అనబడినట్లు గ్రహించవచ్చును. వీటినే యక్షగానాలంటున్నారు; నాటకాలని కూడా వాడుకలో వుంది.

ఈ యక్షగాన ప్రాచీన ప్రదర్శనకళలో మొదటిదిగా - ఓబయమంత్రి రచించిన గరుడాచలంను తీసుకోవచ్చును. తరువాత కందుకూరి రుద్రయగారి సుగ్రీవవిజయాన్ని పేర్కొనవచ్చును.

ఈ యక్షగానాలకు ఎక్కువగా పోషణ, ఆదరణ, ప్రాముఖ్యం తంజావూరు నాయకరాజులకాలంలో లభించినవి. ఈ యక్షగానాలుకూడా తోలుబొమ్మలలాగా దేశీయకళగానే ప్రచారమయినాయి.

చూడగా చూడగా యక్షగానాల పరిణామక్రమమే వీధినాటకాలుగా మారింది అనుకుంటాను.

ఒకపాత్రతో ప్రారంభమయిన యక్షగాన ప్రదర్శనే బహుపాత్రాభినయంగా రూపొంది వీధినాటకాలరూపం ధరించివుండవచ్చును.

ఈ యక్షగానదశనుంచి వీధినాటకాలు ప్రారంభమయి ౧౨వ శతాబ్దంనాటికే అటు యక్షగానాలూ, సరసనే వీధి నాటకాలూ బహుళ ప్రచారంలో వున్నట్లు మనకు పాల్కురికి సోమనాథుడు రచించిన పండితారాధ్యచరిత్రద్వారా అర్థమౌతుంది.

"........ప్రమథ పురాతన
పటు చరిత్రములు
క్రమమొంద బహు నాటకములాడువారు
లలితాంగరసకళాలంకార రేఖ లలవడ
బహురూప మాడెడువారు....."

అని పేర్కొన్నాడు.

అదేకాదు, ఈ యక్షగానప్రదర్శనంలో వేషాలు వేసుకోడం, నాటకరూపంలో ప్రదర్శించడం జరిగేదనికూడా తెలుస్తుంది. అయ్యగారి వీరకవి రచించిన చిత్రాంగద విలాపము అను యక్షగాన రచనలో

"......చిత్రాంగద విలాపమను యక్షగాన మొన రింతు వేషములట్టి జనులు పాడి వినిపింప....."

అని పేర్కొన్నాడు. దీనినిబట్టి యక్షగాన ప్రదర్శన రూపం వీధినాటకమని బోధపడుతూంది.

యక్షగానం, వీథినాటకములలో వాడే భాష, పద జాలం రాను రాను చాలా లోకగ్రామ్యమూ అసభ్యతకు తావిచ్చేదిగా మారిందనీ - ఈ మార్పును చూచి శాస్త్రీయ పద్ధతిని ఈ ప్రదర్శనాపద్ధతులు కొనసాగించాలని తలచి, భామకలాపం అనబడు పారిజాతాపహరణనాటకాన్ని రచించి కూచిపూడివారికి నేర్పించి ప్రదర్శింపజేశాడట సిద్ధేంద్ర యోగి.

నాటినుంచే కూచిపూడి బ్రాహ్మణులకు కూచిపూడి భాగోతులని పేరువచ్చినదని చెబుతారు.

కళాపూరితమయిన తెలుగుకోనలలో అందరి చూపులనూ, హృదయాలనూ ఆకర్షించేవిగా వికసించిన కలువలు మూడు—

ఒకటి—యక్షగాన ప్రదర్శనం.

రెండు—తోలుబొమ్మలు.

మూడు—కూచిపూడి నృత్యం.

ఈ మూడుకలువలూ వేయి రేకులు విచ్చి సహస్ర భావాలతో, వేయివాసనలను విరజిమ్ముతూ తెలుగుకళా స్రవంతినుంచి సెలయేరులుగా ప్రాకి - ప్రపంచకళారంగానికే వన్నెతెచ్చి - మిన్నగా ప్రఖ్యాతిబడసినవి.

## కురవంజి

తెలుగుదేశంలో తొలి నాటకరూపం కురవంజిగా పేర్కొంటారు. కురవలు అనే ఆటవికజాతికి సంబంధించినదే ఈ కురవంజి. ఈ కురవలు అనే ప్రాచీన జాతివారు జానపద నృత్యంగా ఈ కురవంజినృత్యం చేస్తూవుండేవారు.

వీరు దక్షిణభారతంలో - ముఖ్యంగా శ్రీశైలం ప్రాంతాలలోనూ, ఏడుకొండలవానిసన్నిధి అయిన తిరుపతి కొండల పరిసరాలలోనూ - యాత్రికుల గుంపులముందు కురవంజి నృత్యాన్ని ప్రదర్శిస్తూవుండేవారు.

ఈ కురవంజిలో ఒకరే నృత్యంచేయడం, కథచెప్పడం జరిగేదని తెలుస్తూంది. కాని రానురాను వీరూ బహుపాత్రలను ప్రవేశపెట్టారని మనకు బోధపడుతూంది. అందుకు తార్కాణం కురవంజిలో మనకు కనుపించే సింగీ, సింగడే; తరువాత కోనంగి వచ్చింది అనుకోండి.

ఈ కురవంజిపాత్ర వినోదార్థమే కాకుండా కథానిర్వహణకుకూడా ఎంతగానో తోడ్పడుతుంది. సంస్కృత నాటకాలలో వచ్చే విదూషకుడిలాటిదే తెలుగు యక్షగాన నాటకాలలో వచ్చే కురవంజి పాత్ర. తోలుబొమ్మలలో బంగారక్క, జుట్టుపోలిగాడూ పాత్రలు ఎలాంటివో యక్షగాన నాటకాలలో కురవంజి పాత్ర అటువంటిది.

కథాగమనంలో హాస్యంతోపాటు, విజ్ఞానప్రబోధం కూడా ఈ పాత్రలకు ప్రత్యేకించివుండడం గమనార్హం.

అని పేర్కొన్నాడు. ఈ యక్షగానాలలో తాళాలూ ఛక్కీలూ వుపయోగించేవారనీ, ఒకరు పాట పాడితే ప్రక్కవారు ఛక్కీలో, తాళాలో వాయించేవారనీ మనకు విదితమౌతుంది.

పాల్కురికి సోమనాథుడు వ్రాసిన బసవపురాణంలో- సిరియాళచరిత్ర నాటకరూపంలో ప్రదర్శనయిచ్చేవారని చూపిస్తూ—

"......గరిమర్థి నూరూర సిరియాలుచరిత
మేటియై చను భక్తకూటునలందు -
- పాటలుగా గట్టి పాడెడువారు
ప్రస్తుతోక్తుల గద్య పద్య కావ్యముల
విస్తారముగ జేసి వినుతించువారు
నటుగాక సాంగ భాషాంగ క్రియాంగ
పలు నాటకంబుల నటియించువారు......"

(పాల్కురికి సోమనాథకవి బసవపురాణం
చతుర్థాశ్వాసము – ౧౭౫ పేజీ)

అని పేర్కొన్నాడు.

౧౫౦౦ ప్రాంతంలో యక్షగానాలు పాటలద్వారా, నటనద్వారా ప్రదర్శించేవారని మన మూహించవచ్చును.

ఈ యక్షగానరూప పరివర్తనమే నేటి కూచిపూడి భామకలాప ప్రదర్శనం అనుకుంటాను.

కథకళి, మణిపురి, తంజావూరు నాట్యం, దక్షిణాది భరతనాట్యములలోలాగా తెలుగువారి కూచిపూడి

మరి యంబుధిలో......నీ విచ్చితిగో మత్స్యావతారా అని మత్స్యావతారాన్ని చూపిస్తుంటే చాలా ఆశ్చర్యం వేసింది. అంతటి అపూర్వవిద్య ఈ కూచిపూడి నృత్యం.

## మన ప్రాచీనకళలు - మన కర్తవ్యం

పూర్వం ఏ పల్లెవాకిట చూసినా, ఏ తీర్థసమయంలో చూసినా, దేవుని ఉత్సవాలలో చూసినా తోలుబొమ్మల ప్రదర్శనాలో, లేక గొల్లకలాపమో, భామకలాపమో ఏర్పాటుచేస్తూవుండేవారు. కాని రానురాను నవీన నాగరికతల పేరున, పాశ్చాత్య నాగరికతా అనుకరణల వ్యామోహంచే మన అభిరుచులూ, అభిప్రాయాలూ కూడా మారిపోయాయి; మారిపోతున్నాయి.

తోలుబొమ్మలంటే ఛా అంటున్నాం; భామకలాపం అంటే ఒద్దులే అంటున్నాము. పోనీ ఆ గొల్లకలాపంలో కాని, తదితర వీధినాటక పద్ధతులలోకాని, నాట్య సంప్రదాయాలలోకాని నేటి మనోభావాలకు, అభిరుచులకు తగిన, కాలానుగుణమైన మార్పులూ, కూర్పులూ చేసి ఆచరణలోపెట్టడంకోసం శ్రీ నటరాజ రామకృష్ణగారన్నట్లు కృషి జరగవలసివుంది.

అటువంటి మార్పులు జాతీయతకు అసలు రూపాలకు దెబ్బలేకుండా మన ప్రాచీనకళలలో కూడా రావటంలో - తీసుకురావడానికి ప్రయత్నించడంలో తప్పులేదు.

నృత్య ప్రదర్శనాలలో మధ్య మధ్య నేటి ప్రజల అభిరుచులకు తగినట్లుగా నంపూరిగారి ఝెంకిపాటలూ, శ్రీ శ్రీ

గేయాలూ, కృష్ణశాస్త్రి, వేదుల, రాయప్రోలు మొదలగు వారి గేయాలను నృత్యరూపంలో ప్రదర్శింపబూనితే ప్రజలు బాగా ఆకర్షించబడగలరు.

ఈ ప్రయత్నాలు శ్రీ బి. వి. నరసింహారావుగారు మొదలుపెట్టి సాగిస్తూ వచ్చారు.

ప్రాచీనంగా పేరొందుతున్న బుర్రకథలూ, సుద్దులూ, భాగోతం మొదలగు జానపద ప్రచారకకళలు తిరిగి తలయెత్తాయి. అలాగే నృత్యకళారంగంలో కూడా నవీన అభిరుచులకు దగ్గరగా సవరించి ప్రదర్శించబూనడం చాలా అభిలషణీయం; మెచ్చుకోదగ్గ విషయం.

అందుకు ప్రతి సంస్థ, ప్రతి వ్యక్తి, ప్రభుత్వం, దేవాలయసంస్థలు నడుంబిగించాలి. ఇక్కడ చేయవలసింది ఒక్కటే. అది – ఏ యింట పెళ్లి జరిగినా, లేదా ఏ విందో, వినోదమో జరిగినా, ఒకనాటిరాత్రి తోలుబొమ్మల ప్రదర్శనమో, లేదా భాగోతమో, లేక బుర్రకథో ఏర్పాటు చేయించడం. అలాగే ప్రతి గుడిలోనూ దేవుని కళ్యాణాలప్పుడూ, తదితరములయిన పండుగల దినములలోనూ దేవాలయ ధర్మకర్తలు విధిగా ఈ దేశీయ ప్రదర్శనాలను ఏర్పాటుచేయించడం, చేయాలని ఒత్తిడితీసుకురావడం. అలాగే ప్రభుత్వబాధ్యతలు కూడా–కూచిపూడి నృత్యకేంద్రాలను స్థాపించడం, తోలుబొమ్మల ప్రదర్శనాలు చక్కని కట్టుబాట్లతో నడపడానికి సెంటర్లు ఏర్పాటుచేయడం, అందుకు గ్రాంట్లు కేటాయించడమూ.

అలానే రాజకీయపక్షాలూ, సాంస్కృతిక సంఘాలూ, సంగీత, నాటక, సాహిత్య అకాడమీలు కూడా పూను కోవడం.

ఈ పనులు – యిన్ని విధాల ప్రయత్నాలు – అన్ని వైపులనుంచి జరిగిననాడు తప్పక మన ఆంధ్రసీమను ఆరామసీమగా వెరార్చి తెలుగువాకిట వసంతలక్ష్మి చిరు నవ్వులశోభను చూడగలమనడంలో సందేహం లేదు. అందుకు అన్ని రంగాలనుంచి ఆదరణ, పోషణ, ప్రోత్సాహ ప్రోద్బలాలు కావాలి – రావాలి.

మనం యివ్వవలసిన నినాదం, సల్పవలసిన పోరాటం ఒక్కటే. అది మన ప్రాచీన నృత్యభారతిని చైతన్యవంతం చేయడం. అందుకు అందరం ఏకంగా ముక్తకంఠంతో నిన దించాలి.

ఆకులందున అణగి మణగీ కవిత కోయిలతో పాటు, కళాకోయిలకూడా కుహూకుహూ రాగాలతో తెలుగువసంత లక్ష్మికి మేలుకొలుపులు పాడాలి.

సారస్వతరంగమూ, చారిత్రకరంగమూ – సాంస్కృ తికరంగములలో ప్రత్యేకస్థానాన్ని కలిగివున్నట్లుగానే – నృత్య, సంగీత కళలలోకూడా – ఆంధ్రులది ఒక విశిష్టస్థానమని యిక్కడ వేరే పేర్కొనవలసినపనిలేదు. అంతదాకా ఎందుకు? ఆంధ్రులు స్వతహాగా స్వభావసిద్ధంగా కళోపాస కులు, కళారాధకులు.

అనాదిగా ఆంధ్రభూమి అనేక లలితకళారంగాలకు నిలయము. ఉత్తమ కళలకు ఆటపట్టు.

అదేకాదు. — ఆంధ్రభూమికి ఒక ప్రత్యేకతవుంది — ఏమిటీ అంటే — అటు ఉత్తర హిందూస్థానానికీ, ఇటు దక్షిణాపథానికీ మధ్యగా వుండడం.

అలా మధ్యగావున్న ఆంధ్రభూమి — ఉత్తర దక్షిణ భారత సంస్కృతులకు ఉత్తమ సమన్వయకేంద్రంగా నిలచింది. ఆ రెండు సంస్కృతులనూ తనలో లీనంచేసుకొని ఒక క్రొత్తజాతీయతతో మెరుపు వెలుగులతో ఆంధ్ర నృత్యకళ ఆంధ్రసీమను ఆరామమయం చేసింది.

అన్ని జాతులకువలెనే ఆంధ్రజాతికి ఒక ప్రత్యేక కళ వుంది. ఇతర కళలమాదిరిగానే ఆంధ్రుల కళారంగానికీ ఒక ప్రత్యేకతవుంది. అటువంటి ప్రత్యేకతలను పేర్కొన్నప్పుడు కూచిపూడి నృత్యకళకూడా ఒకటి.

కథకళి, మణిపురి కథక్ నృత్యకళారంగాలలో ఆయా జాతుల జాతీయత ప్రతిబింబిస్తూన్నట్లే — మన తెలుగుజాతి జాతీయతాజీవం కూచిపూడి నృత్యంలో తొణికిసలాడుతూంటుంది.

అటు మణిపురి, కథకళి, కథక్ లుగాని, మన కూచిపూడి నృత్యంగాని — యివన్నీ మొత్తంమీద భరతముని ప్రసాదించిన శాస్త్రసంబంధమైన భరతనాట్యశాఖలే.

ఈ నృత్యకళను నాలుగు విభాగాలుగా చేసుకోవలసి యుంటుంది.

1. ఆరాధన నృత్యకళ.
2. శాస్త్రీయ నృత్యకళ.
3. ప్రచార నృత్యకళ.
4. జానపద నృత్యకళ.

ఈవిధంగా – నాలుగు పద్ధతులలో ఈ నృత్యకళ పెంపొందినదని మనం గ్రహించనగును.

ఇక మనం చూడవలసింది– ఈ నాలుగు శాఖలూ ఎలా వుంటాయో అని. అదికూడా ఒకటొకటిగా పరికించుదాము.

## 1. ఆరాధన నృత్యకళ

ఈ శీర్షికలో మనకు దాని ప్రత్యేకత గోచరిస్తూంది. అంటే ఆరాధనకు సంబంధించిన నృత్యకళ అని.

దేవాలయములో దేవునిదివ్యసాన్నిధ్యంలో నృత్యం చేస్తూ, గానం ఆలాపిస్తూ భగవంతుని ఆరాధించుట – దీనినే ఆరాధన కళ అనుకుందాము. మళయాళ నృత్యకళలో పేర్కొనే సేవకళి యిలాటిదే. అలాగే మణిపురివనితలు కీర్తనలు పాడుతూ ప్రదర్శించే నృత్యమూ ఈ ఆరాధన నృత్యవిభాగంక్రిందకే వస్తుంది.

## 2. శాస్త్రీయ నృత్యకళ

శాస్త్రీయమైన కట్టుబాట్లకు లోబడి – భావ, రాగ, తాళయుక్తమైన నృత్యం శాస్త్రీయనృత్యకళగా పేర్కొనవచ్చును.

ఈ శాస్త్రీయ నృత్యం కొంచెం శ్రమతో కూడినది కూడా.

నృత్త, నృత్య, నాట్య, తాండవ లాస్య భేదములను పాటించుచూ ప్రదర్శించే నృత్యము శాస్త్రీయనృత్యం అవుతుంది. ఇందు నవరసములూ ప్రదర్శించగలిగి వుండాలి.

## 3. ప్రచార నృత్యకళ

ఒక చారిత్రక కళావస్తువును యితివృత్తంగా కాని - దానిని ఊరూరా చెప్పడమే ప్రచార నృత్యకళ క్రిందకు వస్తుంది. అలా చారిత్రకకథ ఆకారంతో ప్రచారంగా చెప్పేవి ఏమిటి అంటే- రామాయణగాథ, భాగవతచరిత్ర, తోలుబొమ్మల ప్రదర్శనాలు, వీధి భాగోతము, వీధినాటకాలూ—యివన్నీ ప్రచారనృత్యకళావిభాగం క్రిందకివస్తాయి.

పురాణేతిహాసములను ప్రజాకోటిలో ప్రచారం చేయడానికి ఉపయోగింపబడుతూన్న పద్ధతినే ప్రచారనృత్య కళగా మనం అర్థంచేసుకోవచ్చును.

వీటికి పోలికగా - నృత్యకళగా - మహారాష్ట్రంలోని సంగోరా, తమాషా ప్రదర్శనాలూ, కథకళి నృత్యనాటికా ప్రదర్శనాలూ, ఉత్తరభారతంలోని రామలీల, రాసక్రీడా ప్రదర్శనాలూ ఈ ప్రచారనృత్యకళ క్రిందికే వస్తాయి. ఇక పోతే జానపద నృత్యకళను గురించి చూదాం.

## 4. జానపదనృత్యకళ

ఈ విభాగంక్రిందకు మనం చూసే కోలాటం, తోటల్లో బృందగాన నృత్యం, కుమ్మి, గర్భనృత్యములూ - యివన్నీ వస్తాయి.

ఇక్కడ మనం ముఖ్యంగా చూడవలసినది ఏమిటీ అంటే - మన కూచిపూడి నృత్యకళారాధకులు అటు శాస్త్రీయనృత్యాన్నీ, యిటు ప్రచార నృత్యాన్నీ కూడా చక్కగా గౌరవించి పోషించారు. ఇది కూచిపూడివారిలో వున్న ప్రత్యేకతకు నిదర్శనం.

నేటి భావాలకూ, అభిరుచులకూ దగ్గరగా మన నాట్యసంప్రదాయంలో కూడా కొంత మెలుకువలు తీసుకు రావడం భావ్యమూ, అవసరమూ అనుకొంటూను.

నేడు భావగేయాలనుకూడా నృత్యరీతులలో ప్రదర్శించవచ్చును. కాని అందుకు మనసంప్రదాయంలో కొన్ని మార్పులు అవసరమౌతాయి.

అప్పుడు కథకళి మొదలగు యితర నాట్యసంప్రదాయాలను అనుసరించవలసిన అవసరం కలుగుతుంది. అయినా తప్పులేదు. అది చాలా అవసరం కూడా. అటువంటి ధైర్యం కావాలి.

కూచిపూడివారి భామకలాపం, గొల్లకలాపములలాగానే చాలా ప్రత్యేకత కలిగివున్న నృత్యసంప్రదాయాలలో దశావతార నృత్యవర్ణనలు ఒకటి. అసలు ఈ దశావతార ప్రదర్శనం చాలా శ్రమతోకూడినది. అతిముఖ్యమైన శాస్త్ర

కట్టుబాట్లకు లోబడి శాస్త్రీయమైన పద్ధతుల్లో నేటికీ ప్రదర్శించవలసి వుంటుంది. ఈ అవతార ప్రదర్శనం తాళం, రాగం, సాహిత్యంతో సమన్వయించగా చూస్తుంటే తన్మయులమై, ఆ అవతారాల్లో లీనమై ఆ యా కాలాల్లో నాటి కథాసమయానికి దగ్గరగా కొనిపోబడతాము. అదే అవతార ప్రదర్శనలలోని విశిష్టత.

## ద శా వ తా ర ము లు


శ్రీ మహావిష్ణువు

"పరిత్రాణాయ సాధూనాం
వినాశాయచ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే."

దుష్టశిక్షణ, శిష్టరక్షణ అన్నారు. ఈ పవిత్ర కర్తవ్య నిర్వహణకోసమే శ్రీ మహా విష్ణువు యిన్ని అవతారా లెత్తవలసివచ్చింది.

ఏ దేశంలోనైనా నాశాగజృత్య, హింసాకాండలు స్వైర విహారంసల్పుతూ మానవ జాతి మనుగడకే ప్రమాదం వాటిల్లినప్పుడు ధర్మసంస్థాపనకోసం అవతారపురుషులు

ఉద్భవించక తప్పదు. అలా ఉద్భవించిన మహోనతార పురుషులు—గాంధి, క్రీస్తు, మహమ్మద్ మొదలగువారు.

మహావిప్లవజ్వాలలమధ్య చిక్కుకుని, దారీ తెన్నూ కానక, మార్గాంతరంకోసం పరితపించేభక్తజనకోటినిరక్షించుకోడానికి ఎత్తిన అవతారాలే దశావతారాలు.

ఈదశావతారగాథలు చాలమందికి తెలిసేయుండును. అయినా సచిత్రంగా కొంచెం యిక్కడ పరిచయంచేయడానికి ప్రయత్నిస్తాను.

ఇక్కడ పొందుపరచిన దశావతార భంగిమలు నాట్యాచార్య శ్రీ ఎమ్. ఎస్. శైవాగారిని. మిత్రులు శ్రీ శైవాగారిద్వారా సేకరించినవి.

ఇక దశావతార చరిత్ర పరిచయంచేస్తాను.

"మత్స్య కూర్మ వరాహశ్చ
నారశింహశ్చ వామన
రామో రామశ్చ
బౌద్ధ కల్కి మేవచ..."

అని దశావతార వర్ణన. ఈ పద్ధతిలో మొదట మత్స్యావతారమూర్తిని గురించి మాట్లాడుకోవలసియుంటుంది.

మత్స్యావతారం ఎందుకు ఎత్తవలసివచ్చిందో చూడాలి. బ్రహ్మ మంది



మత్స్యావతారం

మూడవ అవతారం—వరాహావతారం. హిరణ్యాక్షుడు భూమినంతటినీ చాపగాచుట్టి ప్రజలనందరినీ నానా బాధలూ పెట్టసాగాడు. ఈ క్రూరరాక్షసుని సంహరించి శాంతిని నెలకొల్పడానికి ఎత్తిన అవతారమే వరాహావతారం.



వరాహావతారం



నరశింహావతారం

నాలుగవఅవతారం—నరశింహావతారం. హిరణ్యకశిపుడు పచ్చి నాస్తికుడు. కాని కుమారుడు పరమ బాలభాగవతోత్తముడు. ఆ స్తికుడు. ప్రహ్లాదుని అన్ని బాధలకు, కఠిన పరీక్షలకు గురిచేయడంలోనే హిరణ్యకశిపుని నాస్తికత ఎంతటిదో మన మూహింపవచ్చును. ఈ సమయంలో ప్రహ్లాదుని ఆస్తికత్వానికీ,

హిరణ్యకశిపుని నాస్తికత్వానికీ సమరం జరిగింది. ఈ సమరంలో ఆస్థికత్వాన్ని సంరక్షించి, నాస్తికత్వాన్ని నామరూపాలు లేకుండా చేయడమే ఈ నరసింహావతార రహస్యం.

ఐదవది వామనావతారం. బలిచక్రవర్తి దాత— కీర్తి కాంక్ష లేనిదాత. బలిచక్రవర్తి దాతృత్వం యింద్రపదవికే



వామనావతారం

సవాలుగా పరిణమించింది. చూశాడు మహావిష్ణువు. బలి దానాన్ని పరీక్షించడానికి - మూడు అడుగుల భూమికోసం వామనావతారం దాల్చి - చివరకు బలిని సంహరించాడు. ఇదీ వామన అవతారంలో గల ప్రత్యేకత.

ఆరవది పరశురామావతారము. ఇరువదియొక్క పర్యాయములు ధరణీశులనం దరినీ తుత్తునియలుచేసి, పితృవాక్య పాలనచేసి ఇదం బ్రాహ్మ్యం, ఇదంక్షాత్రం అనిబుజువుచేసిన మహామహుడు పరశురాముడు. అవతారపురుషుడు. దీని తర్వాత రామావతారం.

ఏడవది రామావతారం. ఆంధ్రుల ఆరాధ్యదైవం ఈ రాముడు. అవతారపురుషుడు. దేశంలో శాంతి, పితృవాక్య పరిపాలన, దుష్టరావణసంహారం రామావతార ప్రధాన ఆశయాలు.



పరశురామావతారం



రామావతారం

తెలుగునాడు రామనామ సంకీర్తనలతో రామమయమై వుంది.

వేణువుతో గోగణాల్ని తన్మయత్వంతో ముంచెత్తాడు. కంసవధచేసి లోకకళ్యాణకారకుడయిన శ్రీకృష్ణుడు -రాస క్రీడాలోలుడు, భక్తజనరంజకుడు అయిన శ్రీకృష్ణుడు పాండవ పక్షపాతి, గీతావిద్యానాథుడు. వేయేల అవతారపురుషుడు.



కల్క్యవతారము

పదవది కల్క్యవతారము. దశావతారాలలో ఆఖరి అవతారం ఈ కల్క్యవతారం.

ఈ అవతారం లక్ష్యం - దుష్టశిక్షణ, శిష్టరక్షణ.

ఇదీ దశావతారాల చరిత్ర. ఈ అవతారాల రూపం దశావతారాల పవిత్రగాథ.

"గీతం వాద్యం నృత్యం
తధాత్రయం సంగీత ముచ్యతే"—

అని భరతముని ప్రవచనము.

గీత, వాద్య, నృత్యములు మూడూ, భరతముని దృష్టిలో సంగీతశాఖలే. కాని, నేడు సంగీతమనిన — గీత, వాద్యములు మాత్రమేనని పేర్కొంటున్నారు — నృత్యమును వేరే శాఖగా చూపిస్తున్నారు.

సుమారు పదునాలుగవ శతాబ్దారంభమున రచించబడిన గీతసుధాకరమునందు సంగీతమును — కర్ణాటక, హిందూస్తానీ శాఖలు వుండినట్లుగా మనమూహింపనగును.

రాలుకరగించు సంగీతసుధారసహృదయుడు త్యాగయ్య తెలుగువాడు. ఇది ఆంధ్రులమైన మనకు సగర్వంగా చెప్పగల చరిత్ర.

త్యాగయ్య తెలుగువాడైనా సంగీతానికి జాతులూ, మతాలూ, భాషలూ, సరిహద్దులూ - అడ్డురావని నిరూపించింది. అందుకు చూడండి — త్యాగయ్యగారి కీర్తనలు తమిళజాతీయుల పవిత్ర సంగీతవిద్య. త్యాగరాయకీర్తనలు వినిపించని తమిళ సంగీతకంఠం, కచేరీ, గ్రామం కానరావంటే అతిశయోక్తి కాదు.

కర్ణాటక సంగీతం — నాలుగుభాషలవారిని — వీణా తంత్రులలో ముడివేసింది. తమిళ, మళయాళ, కన్నడ, తెలుగు — వారి ఉమ్మడి సంగీతం కర్ణాటక సంగీతం.

కర్ణాటక సంగీతం త్యాగరాజు జీవితకాలం — ౧౭౬౭ - ౧౮౪౭-లో ఉన్నతస్థాయిని - నవనవోన్మేషమై వెలుగొందింది. ఈకాలంలో ఎంతోమంది గాయకులు - వాగ్గేయకారులు, సంగీత విద్వాంసులు వర్థిల్లారు.

త్యాగరాజుసమకాలికులందరిలోకీ మిన్నగా వెలుగొందిన సంగీత భాస్కరుడు త్యాగరాజు. బొబ్బిలి మొదలుకొని తంజావూరువరకూ - తిరువానూరుదాకా - ఈ మధ్య భాగమంతా సంగీతకళతో బాగా వర్థిల్లినది.

సంగీతం ఆపాతమధురము. కనుకనే ఏ వెంపునుంచి చిన్నగా కూనిరాగం గుయ్యమన్నా అటువెంపు అప్రయత్నంగా మన చెవులు తిరుగుతాయి. సంగీతంలో ఉన్న గొప్పతనం చూడండి - నాగస్వరంవిన్న సర్పం, ఒళ్లుమరచి నృత్యంచేస్తుంది. పిల్లనగ్రోవివిన్న గోగణం తలెత్తి ఆ పాటలోని మధురిమకు అలాగే నిలబడిపోతుంది.

అక్కడదాకా ఎందుకు, పాటపాడుతూంటే పసిపాప మొదలు పెద్దలవరకూ అటే చూపులు సారించి, అందులో లీనమై ఏదో లోకంలో మునిగిపోతారు. సంగీతంలో అంతటి మహాశక్తి వుంది.

ఎంతటి మహాశక్తి సంగీతంలో లేకపోతే భాష తెలియని ఏ పరాయిదేశవాసుడో, ప్రాంతీయుడో తన భాషలో సంగీతాలాపనచేస్తున్నా శ్రోతలు తన్మయులై వింటూండడం చూస్తే ఆశ్చర్యం కదూ,

సంగీతం - దాని పుట్టుకను గురించి యిక్కడ చర్చిం చడం నా ఉద్దేశంకాదు - అది చర్చకు అందని విషయం.

కాని మన సంగీతంలోని ప్రస్థానాలు సాహిత్యం నుండి గ్రహించబడినవి. నియమబద్ధమయిన కవిత మార్గ కవితగానూ, నియమబద్ధంకానిదానిని దేశికవితగానూ చెప్పుకున్నట్లుగానే - నియమబద్ధ సంగీతం మార్గసంగీతమనీ, నియమబద్ధముకాని సంగీతం దేశీసంగీతమనీ చెప్పుకున్నారు.

“ఆబాలాబాలగోపాలైః
క్షితిపాలైర్నిజేచ్ఛయాః
గీయతేనానురాగేణ
స్వదేశే దేశిరుచ్యతే.”

(మతంగుడు)

క్రీ. శ. ఏడువందలూ, ఎనిమిదివందల సంవత్సరాలనాటికే మార్గసంగీతం వాడుకలోనుండి తొలగిపోయినియూ, దేశి సంగీతము సంస్కరింపబడి లక్షణ మేర్పరచబడి - శాస్త్ర సంగీతముగా పరిణమించినదని, నేటి కర్ణాటకసంగీతమున కిదే మాతృకలక్షణము నతిక్రమించి లక్ష్యములు పెచ్చుపెరుగుట చేత దేశిసంగీతమునకు భిన్నములైన లక్షణములు బయలు దేరినవని ప్రసిద్ధపరిశోధకులు ప్రొఫెసర్ విస్సా అప్పారావు గారు పేర్కొనివున్నారు. ఇది గమనార్హం.

ముఖ్యంగా ముగ్గురు వాగ్గేయకారులను గురించి ముందు చెప్పవలసివుంటుంది. త్యాగయ్య, క్షేత్రయ్య, అన్న మయ్యలు.

అన్నమాచార్యులు క్రీ. శ. ౧౪౨౩-౧౫౦౩ సంవత్సరముల మధ్యవాడు. సంగీతశాస్త్రమునకు లక్ష్యములైన సంగీత రచనలు వ్రాసినవాడు అన్నమాచార్యుడు. ఈతడు వ్రాసినదే సంకీర్తనలక్షణము అను గ్రంథము.

అన్నమాచార్యుని జన్మస్థానము కడపజిల్లా, రాజంపేట తాలూకాలోని తాళ్ళపాక. చిన్నతనమునుంచే అనగా పదునారవఏటనుంచే భక్తిపూరితుడై - శ్రీవెంకటేశ్వరస్వామి కృపవలన సంకీర్తనలు వ్రాయ మొదలిడినాడని చెప్పుదురు.

అన్నమాచార్యుని సంకీర్తనలు అన్నీ రాగిరేకులపై వ్రాయబడి, భద్రపరుపబడియున్నవి. ఈ అన్నమాచార్యుని సంకీర్తనలలో రెండువిధములు - ఒకటి: అధ్యాత్మకీర్తనలు, రెండు: శృంగార కీర్తనలు.

ఈ కీర్తనల ప్రచారము ఎక్కువగా కానరాదు. కాని, శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు బహుకష్టపడి- సంగీతము కల్పించి వాటి నుద్ధరించు కృషి చేస్తున్నారు.

ప్రతి సంవత్సరమూ ఏడుకొండలవాని సన్నిధిలో - ప్రముఖకళాకారులచేత గానకచేరీలు చేయిస్తూ, అన్నమాచార్యఉత్సవాలు జరిపిస్తున్నారు. ఇది చాలా హృదయానందకరమయిన విషయము.

అన్నమాచార్యుని రచనలద్వారా పూర్వరచనా పద్ధతులు మనం తెలుసుకొనే భాగ్యం కలిగింది. కోవెల, చిలుకపదములు, లాలి, సువ్వి, ఉయ్యాల, జోల, జేజే, శోభన, మేలుకొలుపులు, నలుగులు, దంపుళ్ళు, కూగూ

గులు, వివాహాలు, తందనాలు– మొదలగునవి. ఇందు ముఖ్యముగా పూర్వదేశిసంగీతరచనల స్వరూపము మనము తెలుసుకోవడానికి నోచుకున్నాము.

అన్నమాచార్యుని తరువాత క్షేత్రయ్యను గురించి చెప్పవలసియుంటుంది. ఈతడు క్రీ. శ. ౧౬౦౦ - ౧౬౮౦ మధ్యకాలంనాటివాడు.

అంటే అన్నమాచార్యుని తరువాత నూరేండ్లకు – అనగా పదునేడవ శతాబ్ది మొదటిభాగములో క్షేత్రయ్య వెలసినాడు.

ఈతని జన్మస్థానము కృష్ణాజిల్లాలోని మొవ్వగ్రామము అని మనకు తెలిసిందే. క్షేత్రయ్య కవి, సంస్కృతాంధ్రములలో మంచి పండితుడు. సంగీతానికి– చెప్పేదేముందికనుక– సంగీతంలో విశారదుడంటే చాలు.

భావానుగుణమయిన రచనాపద్ధతికి అంటే సంగీత రచనాపద్ధతికి క్షేత్రయ్య మార్గదర్శి. జాను తెనుగులో శృంగారరసభరితములయినపదములను వ్రాసి మొవ్వగోపాల స్వామివారికి అంకితమొనరించాడు క్షేత్రయ్య.

పదకవితారచనలో క్షేత్రయ్యకు సాటి ఎవరూ లేరంటే–వింతకాదని నాయూహ. పదలాలిత్యములో అనండి, అర్థగాంభీర్యములో అనండి, అన్వయసౌలభ్యంలో అనండి, భావకౌమార్యంలో అనండి – క్షేత్రయ్య పదకవితారచన ఒక విశిష్టపద్ధతిని, పరిణతిని సంపాదించుకొంది.

క్షేత్రయ్య వేలసంఖ్యలో పదాలు రచించినట్లు చెప్పినా - మనకు అందుబాటులో వున్నవి, తెలిసినవి - సుమారు మూడువందల పైచిలుకు అని చెబుతారు. క్షేత్రయ్య పదకవిత సంగీతానికే కాకుండా అభినయకళకు కూడా చాలా ఉపయోగపడినట్లు చెప్పవలసియుంటుంది.

శ్రీ విస్సా అప్పారావుగారన్నట్లు - తెలుగునాట ముఖ్యముగా కూచిపూడి భాగవతమేళములవారిలో క్షేత్రయ్యపదాభినయము వన్నెయు, వాసియూ గాంచినవి. ఇట్లు క్షేత్రయ్యపదములు కర్ణాటక సంగీతమునకూ, గీతము, వాద్యము, నృత్యము, అభినయములన్నిటియొక్క అభివృద్ధికి కారణములైనవి.

అన్నమాచార్యునిగురించీ, క్షేత్రయ్యగురించీ తెలుసుకున్నాక, మనం తెలుసుకోవలసింది త్యాగరాజునుగురించి.

త్యాగరాజు క్రీ. శ. ౧౭౬౭-౧౮౪౭ మధ్యకాలము లోనివాడు. అయినా క్షేత్రయ్య తరువాత సుమారుగానే అనుకొందాము - నూరేండ్లకు జన్మించాడు. త్యాగరాజు వంశీయులు రాయలసీమలోని కంభంతాలూకా గ్రామమయిన కాకర్లలో వుండేవారు. కాని త్యాగరాజు మాత్రం కావేరీ పవిత్రతీరంలో తిరువారూరులో జన్మించాడు. త్యాగరాజు మహాభక్తుడు. మహావిద్వాంసుడు. సంగీత చక్రవర్తి. అన్నమాచార్యుని తరువాత- ఆధ్యాత్మకీర్తనలు వ్రాసిన మహానుభావుడు త్యాగయ్యగారే. త్యాగయ్యగారి కీర్తనలలో - కర్మ, భక్తి, జ్ఞానమార్గముల మేళవింపు కనిపిం

చును. ప్రతిసంకీర్తనయును భగవంతునిగురించి. ఆధ్యాత్మిక. వైరాగ్య బోధనాపూరితములయియుండును.

సాహిత్యబంధమునుండి సంగీతమును తొలగించి సాహిత్యమును ప్రధానముచేసి సంగీతములో స్వేచ్ఛావిహారముచేయుట కొరకు యుక్తముగ కృతులనేకములను ప్రపంచమునకు రచించినవారు త్యాగయ్య, అన్న ఆప్పారావుగారి పలుకులు గమనార్హములు.

ఒక్కమాటలో చెప్పాలంటే—సంగీతసాహిత్యరంగానికి త్యాగయ్య మేలుబంతి.

సంగీత సాహిత్యరంగంలో ముఖ్యంగా కర్ణాటక సంగీతములో చాలా ప్రాముఖ్యమునహించిన ప్రధానవాయిద్య విశేషము వీణ. అందుకే ఎందరో మహానుభావులు వీణనుగురించి యిలా చెప్పియున్నారు.

త్యాగరాజు వేదజనిత నద వీణా అని పేర్కొన్నారు. భరతముని పలుకులుకూడా చూదాం.

“దండంబు శంభుండు
తంత్రులు శాంభవి
కమలాసనాఖ్యుండు కకుభనామ్యో
పత్రిక యిందిరా బ్రహ్మాండంబాకృతి
నాభి సరస్వతి వైభవంబు
దోరకరూపమై దారయును వాసుకి
చంద్రుండు జీవాళి సారె వినుడు
గావున నీ వీణ ఘన సర్వదేవతా

నాయమహాత్రియై సర్వమంగళయగు
బ్రహ్మహత్యాదిపాతక పతితజనుల
పావనము జేయు దర్శ స్పర్శనముల
స్వర్గభోగంబు మోక్షంబొసంగుననుచు
భారతముని దెల్పె............."

దీనినిబట్టి వీణకు ఎంతటి విలువ, కీర్తి, గౌరవము, మహత్వము వుండేదో మన మూహింపనగును.

ఒక విషయం - అసలు పూర్వం వీణలలో చాలా రకముల వీణలు వుండేవని పాల్కురికి సోమనాథుడు బసవ పురాణంలో-అనుకుంటాను-సూచించివున్నాడు.

"రావణహస్తంబు - బ్రహ్మవీణయును
లావణ్యవీణ - కైలాసవీణయును
ఆకాశవీణ - శివశక్తి వీణయు
వివేకింప సారంగవీణయు
కూర్మవీణయు - స్వాయంభువీణయు
గౌరీవీణయు - కిన్నరవీణయు
ఇనక పది మొదలుగాగలవి" అని చెప్పబడినది.

కాని, ఈ ౧౦ వీణా ప్రకారములలోనూ నేడు మనకు అగుపించునవి రెండుమాత్రమే అనుకుంటాను.

అవి - ఒకటి-సరస్వతీవీణ, రెండవది - రుద్రవీణ. ఈ రెండూ రెండుతరహాల సంగీతశాఖలకు ఉపయోగించబడుతున్నాయి. రుద్రవీణను హిందూస్తానీ సంగీతమునకు ఉపయో

గిస్తూంటే, సరస్వతీవీణను కర్ణాటకసంగీతమునకు ఉపయోగి స్తున్నారు.

వీణ అంతటి పరమోత్కృష్టమైన సంగీత వాద్య విశేషము.

మన తెలుగు సంగీతకోవిదులలో ఎందరో మహాను భావులు వున్నారు. అందులో కొందరిని గురించిన విషయ సంగ్రహం పరిచయంచేయడానికి ప్రయత్నిస్తాను.

దక్షిణామూర్తిశాస్త్రి, దేవుడు అయ్యగారు ఇద్దరూ కలిసి గర్భపురికృతులు అనుపేర కృతులు వ్రాశారు. వీరు తెలుగు బ్రాహ్మణులు. తిరుచునాపల్లికి దగ్గరలో వున్న కాహూరులో వుండేవారుట.

అలాగే పల్లవి శేషయ్యగారు చక్కని పేరొందిన విద్వాంసులు. వీరి తండ్రిగారు అయిన సుబ్బయ్యగారు త్యాగయ్యవద్ద శిష్యరికంచేసినట్లుగా కూడా తెలుస్తుంది. సేలంలోని నెయ్కారప్పిట్టి గ్రామంలో జన్మించారు పల్లవి శేషయ్యగారు.

వీరు లక్ష్య, లక్షణ విద్వాంసులుగా పేరు గడించు కొనడమే కాకుండా – పల్లవిని వ్యాఖ్యానించడంలో గొప్ప విద్వాంసులు.

అలాగే చెంగల్వరాయ శాస్త్రిగారిని గురించి. వీరు త్యాగయ్యను బోలు నుంచి విద్వాంసులని చెబుతారు. చాలా కృతులు చక్కగా రచించి కీర్తిగడించుకొన్న వీరు తెలుగు బ్రాహ్మణులు.

వీరు సంగీతంలోనే కాకుండా, భరతనాట్యవిద్యలో కూడా చక్కని పాండిత్యం గలవారు. సుందరేశ విలాసం అనే సంగీత రూపకం రచించినది వీరే.

విద్యల నారాయణస్వామినాయుడుగారు అని ఒక సంగీత విద్వాంసులు - వీరు తిరుపతిలో వుండి సంగీతానికి మంచి సేవచేశారని చెబుతారు.

సుసర్ల దక్షిణామూర్తిగారు సంగీతంలో పేరుపొందిన ఘటికులు. త్యాగయ్య శిష్యులయిన మానంబుచదివి సుబ్బయ్యగారివద్ద సుసర్ల దక్షిణామూర్తిగారు శిక్షణ పొందారు.

శిక్షణానంతరం సుసర్ల దక్షిణామూర్తిగారు బందరులో వుండి ఎంతో చక్కగా సంగీతసేవచేశారు. వీరి రాకతోనే బందరు సంగీతనిలయమైనది అంటే అత్యుక్తి కానేరదు. బందరు అనగానే - మనకు జ్ఞాపకంవచ్చే సంగీత విద్వాంసులు - హరి నాగభూషణంగారు, జంగం కోటయ్యగారలు- చక్కని గాయకులు.

ఇక మనం రాలెరగించిన రాగోపాసకుని గురించి చూదాం. ఆయనే సంగమేశ్వరశాస్త్రిగారు. వీరు ౧౮౭౪-౧౯౩౨ మధ్యవారు. వీరు ప్రఖ్యాతవైణికులు. సంగమేశ్వర శాస్త్రిగారి వీణాగానం శ్రోతలను ముగ్ధులను చేసేది. అందుకు చిన్న ఉదాహరణ యిస్తాను.

విశ్వకవి రవీంద్రనాధ్ ఠాకూర్ ఈ రాగోపాసకుని వీణావాయిద్యానికి ముగ్ధుడై మురిసిపోయాడుట. తనతో

పాశ్చాత్యదేశపర్యటనకు కూడా అప్పుడు ఆహ్వానించారుట–కాని, సంగమేశ్వరశాస్త్రిగారు ఆచార వ్యవహారాలకు లోటువస్తుందనే తలంపుతో వారితో వెళ్ళలేదు. నాడు సంగమేశ్వరశాస్త్రిగారే కనుక విశ్వకవితో కలిసి వెళ్ళి వుంటే ఈ రాగోపాసకుని కీర్తి విదేశాలలో మారు మ్రోగేది. ఈ విషయం శ్రీ మండపాక రాజేశ్వరశాస్త్రిగారి అనుభవాల వ్యాసంద్వారా తెలుసుకున్నది. అలాగే సంగమేశ్వర శాస్త్రిగారిని గురించి– విశ్వకవితో శాస్త్రిగారి పరిచయాన్ని గురించి శ్రీ మండపాక రాజేశ్వరశాస్త్రిగారు తెల్పిన ముఖ్య విషయాలు పరిచయంచేస్తాను.

రవీంద్రనాథ ఠాకూర్ గారికి వీణ చాలా యిష్టం. ఎవరికివుండదు చెప్పండి వీణాధ్వని కూడ మధుర్యవ !

శ్రీ రవీంద్రనాథ ఠాకూర్ గారికి వీణయంటే ఎంత అభిమానమో, ఎంత పూజ్యభావమో చూడండి! వీణను శరీరంగానూ, వీణాతంత్రులు హృదయతంత్రులుగానూ, వీణావాద్యం హృదయమునుంచి వచ్చిన పాటగాను, వాద కుడు భగవంతుడేయనీ వారు తరచు తమ గేయాలలో ఉదహారిస్తూవుండేవారు.

ఇంతకూ అసలువిషయంలోకి వస్తాను. శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారు తమ వీణావాద్యంద్వారా రవీంద్రుని ఎలా ముగ్ధులనుగావించారో కూడా కొంచెం తెలుసుకుందాం.

రవీంద్రుడు పిఠాపురంలో రాజావారింట విడిదికి వస్తూ ఎవరైనా వీణావాయిద్యవిద్వాంసునికచేరి ఏర్పాటు

చేయమని కోరారు. అందుకు పిఠాపురంవారు శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారి వీణావాద్యం ఏర్పాటుచేయించారు.

సరిగా మూడుగంటలకు శాస్త్రిగారిబసలో సంగమేశ్వరశాస్త్రిగారి వీణావాద్యం ప్రారంభమయింది. వాయిస్తున్నంతసేపూ వారి విగ్రహం ఏమాత్రం చలనంలేకుండా వుంటుంది. నేత్రాలు అర్ధనిమీలితంగా వుంటవి. తంతిలో అపస్వరం వస్తే తెలిసినట్లే, తనవాద్యం శ్రోతలకు నచ్చిందీ, లేనిదీ వారిని చూడకుండానే ఆయనకు తెలిసిపోతుంది. తంతి సరిచేసుకున్నట్లే ఆయన తన వాద్యము శ్రోతలహృదయాలకనుగుణంగా సరిదిద్దుకుని వాయించుకపోతారు.

ఇలా వీణావాద్యంలో మునిగివున్నారు శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారు. రానురాను మబ్బులలోంచి బైటపడ్డ చంద్రునిలాగ శాస్త్రిగారి మోము విప్పారి ఆనందంతో తొణికిసలాడింది. అంతకంతకూ ఆవేశం ఎక్కువయింది. అవశంగా ఆయనశరీరం నాగస్వరంపాటకు నాగుబాము ఊగినట్లు వూగిసలాడింది. పుష్పాంజలితో దైవసన్నిధిని కూర్చొని ధ్యాననిమగ్నుడైన యోగిలాగు ఆయన దోసిలిపట్టి అంతవరకూ అలాగే కూర్చున్నారు........రాత్రి ఎనిమిది గంటలైంది. అప్పుడు శాస్త్రిగారు యింకా వాయించమన్నారా! ఆపివేయమన్నారా? అంటే, అప్పుడు శాస్త్రిగారు అన్నారుట— 'ఈ అమృతవాహినిలో మునుగుతూ తేలుతూ ఇలాగే రాత్రంతా కూర్చోమంటే కూర్చోవాలనేవుంది' అని.

దీనినిబట్టి శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారి వీణావాద్యం ఎంతటిదో గ్రహించగలగడం ఏమీ కష్టంకాదు. అటువంటి మహావ్యక్తికి-పాల్గొనించే రాజోపాసకునికి-ప్రఖ్యాత ఆంధ్ర వైణికునికి వేరే కీర్తి జోహార్లు అర్పించడంవినా ఏం చెప్పగలం.

దక్షిణభారతంలో సంగీతకళలో గొప్ప కీర్తి గడించిన కొన్ని మహానగరం - విజయనగరం. విజయనగరం అంటేనే సంగీతం అనిపిస్తుంది. అక్కడ ఎందరో సంగీత విద్వాంసులు వుండి గౌరవించబడి, పోషించబడినారు. విజయనగర సంస్థానాధిపతి ఆనందగజపతిగారూ గొప్ప వైణికులే.

వీణ వెంకటరమణదాసులాంటివారెందరో గొప్ప పేరొందినవారు అక్కడున్నారే.

ప్రఖ్యాత ఫిడేలు వాద్యకులు శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడు (పద్మశ్రీ)గారు నేడు సంగీత కళోపాసనకు ఎంతో మహత్తరసేవచేసి కళను ముందుకు తీసుకొనిపోతున్నారు.

చిన్నవయసులోనే ప్రఖ్యాతిగడించుకున్న యువగాయకులు శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారి పేరు గమనార్హం.

ఈవిధంగా ఎంతమందో గాయకులు, వైణికులు పే గడించుకొని, ఆంధ్రసంగీతకళాసేవ చేస్తున్నవారు వున్నా వారెంతయు సంస్తవనీయులు.

ఉజ్జ్వల చరిత్ర, విశిష్ట సంప్రదాయమూ కలిగిన తెలుగువిపంచి కలకాలమూ తన అగ్రస్థానమును నిలుపుకొని కళారాధకుల నిత్య నీరాజనములందుకోవాలని ఆశిద్దాం.




ఆంధ్ర నాటక కళారంగం
నేలనాలుగు చెరగులా కీర్తిగడించుకొన్న...
తెలుగు రంగభూమి చరిత్ర

"నానా భావోపసంపన్నం

.....................

నాట్యమేతన్మయాకృతం"—

అని సూత్రీకరించాడు – భరతముని.

నాటకానికి అంతటి విలువవుంది. సాంఘికంగా, రాజకీయంగా, వినోదాత్మకంగా, విజ్ఞానపరంగా నాటకానికి ప్రత్యేకపాత్ర వుంది.

ఏ దేశచరిత్ర చూచినా, ఏ దేశకళను తిలకించినా, మనకు కనుపించేది – నాటి ప్రధాన సాంఘిక, రాజకీయ సమస్యల ప్రతిబింబాలే. లేదా చారిత్రక ఘటనలు యితివృత్తంగాగల రూపాలే.

ఇవే ఏ రచనకైనా కళకైనా – కాంతినిచ్చేవి, తుష్టినీ పుష్టినీ కల్గించేవీను.

అందుకే – ఏ కవి నాటకరచననైనా తిలకించండి, కథా రచనను పరికించండి, మనకు అగుపించేది – నాటి సాంఘిక వాతావరణం, సమాజంలో నలుగుతూన్న ప్రధానసమస్యల ప్రతిరూపాలు.

అలా కాకుండా – అవసరంకాని, అర్థంకాని సమస్యలను ఎత్తుకొని ప్రజలమీద రుద్దుదామని అనుకోడం చాలా పొరబాటు.

ఆ ఘోరపాపాన్ని కవి ప్రశ్నించగలగడం అనేది - ప్రజాదరణ లభించడంవల్లాయి వుండాలి.

ప్రజాదరణ లభించకపోవడానికి కారణం ప్రజాభిరుచులకు, భావాలకు - నాటి ప్రధాన సమస్యలకూ వారి రచనలు దూరంగా వుండడమే.

ప్రజలకూ, వారి సమస్యలకూ, అభిరుచులకూ, అభిప్రాయాలకూ - ఆదర్శాలకూ ఎంత దగ్గరగా వుంటే అంత దగ్గరగా ప్రజలు వారికి స్వాగతం పలుకుతారు, భుజాలమీద ఎత్తుకుని ఆకాశమంత ఎత్తు ఎగరేసి పూజించి గౌరవిస్తారు. ఇదిమాత్రం నిజం.

కన్యాశుల్కం అందుకున్నంత గౌరవం, పొందిన పేరూ - యింత అంత అనడానికి తూకంలేదు.

నాటి సంఘంలో, సమాజంలో కన్యాశుల్కంలోని సమస్యలు ఎన్నో అపరిష్కృతాలుగా వున్నాయి. వాటిని కళ్ళకుకట్టినట్లు చిత్రించాడు నవయుగ వైతాళికుడు - అమరకవి-గురజాడ.

"నిరాశ్రయాన శోభంతే
పండితావనితాలతాః"___

అన్నట్లు పాండిత్యప్రకర్షకోసం, రాజుల మెప్పుదలల కోసం రాసిన రచనలకు ఆశ్రయాలూ, రాజాదరణలూ కావాలి. లేకుంటే అవి ప్రకాశించడం వుట్టిమాటే. కాని రాజాదరణ, వారి మెప్పూ కోరకుండా - ప్రజల కోసం

నా రచన, ప్రజాసమస్యల ప్రతిబింబం నా రచన—ప్రజల కలం నా కలం — అన్న పరమార్థంతో విశ్వశ్రేయః కావ్యం అన్న పరమార్థంతో సమన్వయించే రచయితకు. అలాంటి స్వతంత్రరచనకు తప్పక ప్రచారమూ వుంటుంది, ప్రజాదరణా వుంటుంది.

అది కథ కానివ్వండి. నాటకం కానివ్వండి, కవిత అనండి—కావ్యం అనండి—ఏదైనా సరే — నాలుగుకాలాలు ప్రజలమధ్య నిలవాలి అంటే — నిలవాక్కోరేదానికి దానికి సత్తువగా ప్రజలకోసం అన్న పరమసత్యం—సమాజచిత్రణ—నాటి సాంఘిక ప్రధానసమస్యలూ—ప్రజాభిరుచులువుండాలి. అప్పుడు గులాబీకి ముళ్ళున్నా ఎలా చూపుల నాకర్షిస్తుందో, తేనెటీగలు కుడుతున్నా - తెగించి ఆ తేనెపట్టులోని తేనె యొక్క— మాధుర్యాన్ని ఆస్వాదించడానికి మానవుని జిహ్వ ఎంత అంగలారుస్తుందో — అలాగే ఈ రచనలకూ ప్రజా సమూహం విరగబడుతుంది.

ఈ సత్యాన్ని అన్నికాలాలలోనూ, అన్ని రచనల లోనూ మనం చూస్తున్నాము.

భగవత్ పరమయినవి, చరిత్రాత్మకమైనవి, సాంఘిక మైనవి—యివన్నీకూడా ప్రజలకు కావలసినవే.

భారతీయహృదయం భగవత్స్వరూప సందర్శనం కోసం ఎదురుచూస్తుంది. ప్రపంచానికంతటికీ భారతీయులకు ఆధ్యాత్మికచింతన ఎక్కువ. అలాగని కర్మ అనుకోని కాదన్నదు భారతహృదయం. స్వతంత్ర భావన, అభ్యుదయ మార్గం భారతజాతికి అమూల్యరత్నాలు.

ఆ స్వాతంత్ర్యేచ్ఛయే కనక భారతజాతిలో లేకుంటే మన ఆశలూ, ఆదర్శాలూ, సంస్కృతీ, విజ్ఞానం — మూల్గి మూల్గి క్షీణించి నశించి నామరూపాలు లేకుండాపోయేవి ఏనాడో.

కాని, భారతజాతి శాంతికోసం — శాంతిగానే పోరాటంసల్పకుండా కూర్చోలేదు.

"ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే..."

అన్న పరమోపదేశం భారతహృదయప్రతిధ్వని.

అంతటి పరమోత్కృష్టమైన చింతన మనది. కనుకనే — అశోకునీ, బుద్ధుణీ మార్గదర్శులుగా గొని మన దేశాన్ని, మన భావనలను, సంస్కృతినీ తీర్చి దిద్దుకొంటున్నాము. ప్రపంచ దేశాలన్నిటా శభాష్ అనిపించుకొంటున్నాము. అలాగే ప్రపంచ సాహితీరంగంలోకూడా మనకు స్థానంవుంది.

కవికులగురువు — మహాకవి కాళిదాసు సాటిలేని పేరు గడించుకున్నాడు. దానికి తార్కాణంగా ఆ మహాకవి రచించిన అభిజ్ఞాన శాకుంతలనాటకం — భారతదేశంలో ఎన్ని ముద్రణలు — ఎన్ని భాషలలో వెలువడిందో చెప్పనవసరంలేదు సరికదా — ప్రపంచ దేశాలలో ముఖ్యంగా జర్మన్, ఇంగ్లీషు, రష్యన్, డేనిష్, ఇటాలియన్, డచ్, స్వీడిష్, స్పానిష్, చీనీ, పోలిష్ మొదలగు భాషలలోకి ఏనాడో శాకుంతలం అనువదింపబడీ, గౌరవింపబడి పొగడ

బడింది. అంతటి రచనాబలిమిగలిగిన నాటకం అది. నాటకానికి ఉండవలసిన ఘటనైక్యము, ఘటనాపూర్వకత, ఘటనల ఘాత ప్రతిఘాతగతి, కవిత్వం, పాత్రచిత్రణము, సార్వజనీనత మున్నగు ముఖ్యలక్షణములన్నీ ఈ శాకుంతలనాటకరచనలో వున్నాయి.

అందుకే ఆ మహాకవిని గురించి ఏం చెప్పాలన్నా తాహతు చాలదు కనుకనే—

"కాళిదాస గిరాంసారం
కాళిదాస సరస్వతీ
చతుర్ముఖోథవా సాక్షాత్
విదుర్నాన్యేతు మాదృశా!..."

అని ఒక మహావిద్వాంసుడు వచించాడు.

ఇంతటి మహానాటకకర్త అయినాడు కనుకనే—

"పురాకవీనాం గణన ప్రసంగే
కనిష్టికాధిష్ఠిత కాళిదాసః
అద్యాపితత్తుల్యకవేరభావా
దనామికా సార్థవతీ బభూవ..."

అని భారతజాతి ఆ కవికులగురువును గౌరవించుకొంటూంది.

ప్రపంచ నాటక సాహిత్య రంగంలో అటు ఇంగ్లీషులోనూ, ఇటు సంస్కృతంలోనూ మొదటి విత్తు జల్లబడింది.

గ్రీకులో క్రీస్తుపూర్వం ౬౦౦ నాటికే నాటకరచన-ఎంతో కొంత అనుకోండి – ఆరంభమయిందని విమర్శకుల అంచనాలవల్ల తెలుస్తూంది.

పోతే - మన భారత సాహిత్యరంగంలో - నాటక పద్ధతి ఏదో రూపంలో వుందనీ, ఋగ్వేదంలోనే నాటకం కనిపిస్తుం దనీ ఒక సాహిత్య విమర్శకులు పేర్కొన్నారు.

ప్రతి దేశంలోనూ, ప్రతి సాహిత్యరూపంలోనూ - వరుసగా అనేక మార్పులతో - అనేక రూపాలను సంతరించు కుంటూ మారుతూ వస్తూండడం కద్దు.

అలాగే మన భారత సాహిత్యరంగంలోనూ - మన తెలుగు నాటకరంగంలోనూ కూడా.

చూడండి. ఒకనాటి నాటకకళాప్రతిబింబమే యక్ష గానం. నేటి నాటకరంగంతో పోల్చిచూస్తే ఎంతలో ఎంత మార్పో చిత్రంగా వుంటుంది. యక్షగానాలు, తోలు బొమ్మలాట యివన్నీ తెలుగునాట తొలినాటకరూపాలు గానే పేర్కొనవచ్చును.

ఈ నాటకపద్ధతి పాల్కురికి సోమనాధునికాలం నాటికే ప్రచారంలో వున్నట్లు మన మూహించవచ్చును.

ఆ యా దేశాలయొక్కగానీ, జాతులయొక్కగానీ, ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లూ మనం ఆ దేశం లేక - జాతియొక్క లలితకళలలో - ముఖ్యంగా నాటకము మొదలయిన వాటిలో చూస్తే యిట్టే మనకు సుబోధక మవుతోంది,

ఆ జాతి చరిత్ర ఏమిటి? వారి నాగరికత పురోగ మనం, వారి మనః ప్రవృత్తులు, మతవిలువలు, రాజకీయ పరి

గామాలు, సాంఘికపరమైన సమాజపురోభివృద్ధి—యివన్నీ ఈలాంటి నాటకకళలో మనం ప్రత్యక్షంగా చూడగలుగుతాము.

అందుకే చూడండి, యిద్దరు పాశ్చాత్య రచయితలు ఏమన్నారో—

జానపదకళారూపాలు - ఆ యా దేశాల, లోక జాతుల - ఆ ప్రాంతపు శాసనాలకంటే ఎక్కువ విలువైనవి—అని పేర్కొన్నాడు స్లైచర్ మహాశయుడు.

ఈ జానపదకళాఖండాలు - వారి వారి ఆచారాలూ, నాగరికతా విలువలూ ప్రతిబింబిస్తాయి—అని పేర్కొన్నాడు అలెగ్జాండర్ యాగర్ర్స్కోఫ్.

అలాగే ఆంగ్ల నాటకకవి, విమర్శకా గ్రేసరుడూ అయిన-జాన్ డ్రైడన్ ప్రఖ్యాతిసిద్ధుడయిన మానవుని అభిరుచులను ప్రతిబింబించేదే నాటకం అని సిద్ధాంతీకరించాడు.

యుద్ధసన్నద్ధులను చెయ్యడంలో బుర్రకథలూ, నాటి సమస్యలను ప్రజానీకపులదృష్టికి తీసుకురావడంలో వీధినాటకాలూ ప్రముఖపాత్రవహించినట్లు మనం ఎరిగున్నదే.

తెలుగుదేశాన్నే తీసుకుందాం. యక్షగానాలూ, కురవంజులూ, తోలుబొమ్మలూ, సుద్దులూ, బుర్రకథలూ—యివన్నీ తెలుగునాట అనాదిసిద్ధమయిన జానపదకళారూపాలే.

ప్రాచీన తమిళవాఙ్మయంలోకూడా ఈ కళ అతి ప్రాచీనముగా కనబడుతూంది. కూత్తుం, మరక్కాల్ నగైరా నేటికీ జానపదకళలలో భాగస్వాములుగానే కనబడుతున్నవి.

నేటి దాంబదాసరి నృత్యమే తమిళవాఙ్మయంలో కలినాట్యమని, మన తోలుబొమ్మల ప్రదర్శనాలే తమిళ వాఙ్మయంలో తోల్పావై అని వ్యవహరించబడ్డాయి.

పాల్కురికి సోమనాథుడు బసవపురాణంలో......
"గరిమద్ది నూరూర, శిరియాలు చరిత, నేటిదై చను భక్తకూటులలందు...పాటలుగా గట్టి పాడెడువారు, బ్రస్తుతోక్తుల గద్యపద్య కావ్యముల విస్తారముగజేసి వినుతించువారు, నటుగాక సాంగభాషాంగక్రియాంగ పటునాటకంబుల నటియించువారు"—అని పేర్కొన్నాడు.

అతడే తన పండితారాధ్యచరిత్రలో......
"......ప్రమథ పురాతన
పటు చరిత్రములు
క్రమ మొంద బహునాటకములాడువారు...

అనికూడా సూచించివున్నాడు. దీనినిబట్టి ఈ నాటక కళ, రచనా అంత ప్రాచీనమయినవని మన మూహింపవగును.

పదునొకండవ శతాబ్ది మధ్యభాగమునందు నన్నయ భారతాంధ్రీకరణముతో తెలుగుసాహిత్యము ప్రారంభమై నేటివరకునూ అవిచ్ఛిన్నంగా సాగుచున్నది.

తెలుగులో రూపకరచనకు ప్రయత్నములు చెదురుగా జరిగినట్లు తెలిసినా, వల్లభామాత్యుని క్రీడాభిరామ

మనెడి వీథిరూపకముతప్ప తెలుగులో రచింపబడిన రూపకమనేది మన కింతవరకునూ లభింపలేదు.

వల్లభరాయలు క్రీడాభిరామములో విషయము శృంగారవరస్యారసములు ప్రచురముగా వాక్యోపవాక్యములుగా పద్యరూపమున నుండును. దీనిని వినుకొండ వల్లభరాయలు ప్రేమాభిరామము అను సంస్కృత గ్రంథము ననుసరించి వ్రాసినట్లు ప్రచారములో కలదు. ఈ గ్రంథము సుమారు ౧౪౨౦లో రచింపబడియుండునని ప్రముఖ చారిత్రకపరిశోధకులు విద్వాన్ గంటి జోగిసోమయాజిగారు ప్రాచీన కావ్యమంజరిలో పేర్కొనియున్నారు.

కాని, యిక్కడే-అంటే-వల్లభరాయని క్రీడాభిరామమును గురించి ఒక వాదము కలదు. ఇది శ్రీనాథునిచే రచింపబడినదనియు, వల్లభరాయనిపేర ప్రచారములోనికి వచ్చినదనియు నొక వాదము కలదు.

ఏది ఎలాగున్నా - నాకు తెలిసినంతలో - తెలుగులోని ప్రథమనాటకరూపకము ౧౮౬౦ ప్రాంతమున రచింపబడిన శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారి మంజరీ మధుకరీయం అనెడి నాటిక. ఇది అనువాదము కాదు - స్వతంత్ర తెలుగురచన.

౧౮౮౦ - ౮౧లో ఆంధ్రనాటకరంగచరిత్రలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమయిందనే చెప్పవలసియుంటుంది.

౧౯వ శతాబ్దం చివరి అర్ధభాగంలో ఆంధ్రదేశంలో పర్యటించిన మహారాష్ట్ర, కర్ణాటక నాటకకంపెనీలద్వారా తెలుగు నాటకరంగం ఉత్తేజితమయినదని చెప్పడంలో వింత గోచరించదనుకుంటాను.

పూనా, ధార్వాడ్ కంపెనీలలోని కొందరు ఆంధ్రదేశములోనే వుండిపోయి హిందీనాటకాలు ఆడించేవారు. ఆ ఉత్సాహ ఉద్రేకాలవల్ల తెలుగు యువకులూ ముందుకు వచ్చి - స్వంత కంపెనీలను ప్రారంభించి, తెలుగులో నాటకాలను వ్రాయించుకొని ప్రదర్శిస్తూవుండేవారు.



కందుకూరి వీరేశలింగం

౧౮౮౦-౮౧లో హార్వాడ్ కంపెనీవారు రాజమండ్రిలో ఒక తాటియాకులపెండాలు వేసుకొని నాటక ప్రదర్శనలిచ్చారు. వారి ప్రదర్శనానంతరం ఆ పెండాలను తీసివేయకముందే శ్రీ వీరేశలింగంపంతులుగారు కళాశాలవిద్యార్థులచే చమత్కార రత్నావళి - అనుకొంటాను- ప్రదర్శింపజేశారు. ఈ చమత్కారరత్నావళి - షేక్స్పియర్ వ్రాసిన కామెడీ ఆఫ్ ఎర్రర్స్‌కు అనువాదం.

కందుకూరి వీరేశలింగంగారి కలంనుంచి ఎన్నో అనుకరణలూ, అనువాదాలూ వచ్చాయి. రాగమంజరి, కళ్యాణకల్పవల్లి అనే రెండు అనుకరణలు షెరిడాన్ వ్రాసిన - 'డుయెన్నా' 'ది రైవల్స్' అన్న నాటకాలకు అనువాదాలు.

శ్రీ కందుకూరి వీరేశలింగంగారు మొదటి అనుకరణకర్త. ఆధునికయుగంలో ఆంధ్రసాహిత్యంలో వెలసిన నూతన సాహిత్య ప్రక్రియలకెన్నిటికో ఆయన భగీరథుడు- నవ్యాంధ్రసాహిత్యానికి నిజమైన వైతాళికుడు.

తెలుగులో మొదటి నాటకకంపెనీ ౧౮౮౦లో రాజమండ్రిలో శ్రీవీరేశలింగంపంతులుగారిచే స్థాపించబడ్డది. తరువాత తరువాత ఆంధ్రదేశముఖ్యపట్టణములన్నిటా కూడా నాటకసమాజాలు ప్రారంభమైనాయి.

కృష్ణమాచార్యులుగారు ప్రారంభించిన నాటకసమాజం ౧౮౮౭వ సంవత్సరంలో బళ్ళారిలో స్థాపించబడినది. ఎలాగైతేనేం కృష్ణమాచార్యులుగారి నాటకసమాజం అనతికాలంలోనే చాలా ప్రసిద్ధి చెంది - అభివృద్ధిలోనికి

వచ్చినది. దీనికి కృష్ణమాచార్యులుగారి కార్యదీక్ష, పట్టుదల, ఉత్సాహం, ముఖ్యకారణములు. అందుకుతోడు అదృష్టముకూడా అనుకోండాను మొత్తంమీద నాటి నాటకసమాజాలలో ఉత్తమసమాజంగా కృష్ణమాచార్యుల వారి సమాజం కీర్తి గడించుకొన్నదన్నదిమాత్రం మరువ కూడదు.



శ్రీ కృష్ణమాచార్యులుగారు

ఈవిధంగా ఎంతోమంది నాటకరచయితలూ, నాటక సమాజాలూ ఆంధ్రదేశంలో పుట్టి ఎంతో అభ్యుదయమార్గాలవెంట పురోగమిస్తున్నాయి.

వీరి చిత్రనళీయం, సారంగధర; వీరేశలింగంగారి అభిజ్ఞాన శాకుంతలము, తిరుపతి వేంకటకవుల మృచ్ఛకటిక, పాండవ నాటకాలు, లక్ష్మీనరసింహం పంతులుగారి గయోపాఖ్యానం. నరకాసురునివధ; వెంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయం, పానుగంటివారి రాధాకృష్ణ, పాదుక, గురజాడవారి కన్యాశుల్కం మొదలగు నాటకాలు ఎన్నో ఆంధ్రనాటకకళాలక్ష్మికిభూషణాలుగా నిలచి, విజయయాత్ర సల్పినవి. ఆంధ్ర ప్రజానీకంచేత ఆదరించబడి — ఆంధ్రేతర ప్రేక్షకుల పొగడ్తలనందుకున్నవి.

వడ్డాది సుబ్బారాయుడుగారి వేణీసంహారం, చిలకమర్తివారి ప్రసన్నయాదవం, బలిజేపల్లివారి హరిశ్చంద్ర, శివాజీ — నాటకాలూ ప్రసిద్ధిపొందాయి.

తెలుగు నాటకకళాలక్ష్మికి నిలయం అనదగిన బళ్లారి మనకు దక్కకుండాపోయింది. ఆంధ్రనాటకరంగానికి పితామహుడైన ధర్మవరం కృష్ణమాచార్యులవారు ప్రపంచప్రఖ్యాతినందిన బళ్లారి రాఘవకు మేనమామ.

కళాప్రపూర్ణ బళ్లారి రాఘవస్థానాన్ని అప్పుడూ — యిప్పుడూ కూడా ఎవరూ అందుకోలేదంటే అతిశయోక్తి కాదు.

పఠాన్, హిరణ్యకశిపుడు, రామదాసు, చాణుక్య మొదలగు వేషాలు ఆంధ్ర ప్రేక్షకలోకం కళ్ళముందు యింకా మెరుస్తూనేవున్నాయని చెప్పాలి.

నాటక రచనారంగంలో గురజాడవారి కన్యాశుల్కం ఎంతటి విప్లవాన్ని కలిగించిందో, నాటక నటనా ప్రతిభలో రాఘవకీర్తి అంతగానూ ప్రకాశించింది.

చివరకు ఓ కవిమిత్రులన్నట్లు, శూద్రకుని మృచ్ఛకటిక నాటకం తర్వాత ౧౦౦౦ సంవత్సరాలకు తిరిగి వెలువడిన అపూర్వనాటకం కన్యాశుల్కం.

పాశ్చాత్య నాటకరంగం నవీనమయిన మార్పులతో ప్రస్ఫుటంగా వెలుగొందింది ఇబ్సన్‌తోనే అంటారు. తర్వాత నాటకరచనకు మరింత సమగ్రమైనరూపం కల్పించినవాడు బెర్నార్డ్‌షా అని. అలాగే సీన్ ఒకేసీ, సింజీ, ఒనీల్, ప్రీస్ట్లీ మొదలగువారు. ఆ నాటకరచనా సంప్రదాయాలను యింకా నూతనమైన పద్ధతులతో రూపొందించారని అంటారు.

నవీనమైన మెరుగులతో చక్కగా నిలచిన ఆ పద్ధతులను ఇలియట్, స్టీఫన్ స్పెండర్, ఆడెన్ వంటివారు యింకా రూపుదిద్దారని పేర్కొంటున్నారు.

అలాగే మన తెలుగు నాటకసాహిత్యరంగంలో కూడా కాలానుగుణమైన మార్పువచ్చింది. అంతదాకా నాటకాలు పురాణగాథలతోనూ,. పద్యాలూ, పాటలతోనూ నిండి వున్నవి. రానురాను చాలా మార్పులు చెందాయి. ఆ మార్పే వ్యావహారికభాషతోకూడి వెలువడిన గురజాడ వారి కన్యాశుల్కం.



గురజాడ అప్పారావు

నాటి సమాజంలో, సంఘంలో ప్రధానంగావున్న కొన్ని సమస్యలను సృజనాత్మకమైన భావనాబలంతో నిరూపించి రచించారు కన్యాశుల్కం. అందుకే నాటికీ నేటికీ ఆ నాటకం, ఆ కవి ఆంధ్రులకు పూజనీయులుగా వున్నారు.

అలాగే నాటకాలలోనూ ఒక విప్లవం వచ్చింది. అదే రాఘవయుగం.

ప్రపంచ ప్రఖ్యాతినార్జించిన స్తానిస్లావిస్కీ పేరు వినని వారుండరు. ఈయన నాటకరంగంలో ఒక మహావిప్లవం తీసుకువచ్చాడు. ఇతను స్థాపించినదే విశ్వనాటకరంగానికే ఆదర్శప్రాయమై నిలచిన మాస్కో ఆర్ట్ థియేటర్. జర్మనీ,



బళ్ళారి రాఘవాచారి

ఫ్రాన్స్, అమెరికాలలో నాటకాలు ప్రదర్శించి ఆ యా దేశాలలో విప్లవం లేకెత్తించాడు.

ఆ ప్రదర్శనాలను సమీక్షించిన న్యూయార్క్ పత్రిక ఒకటి యిలా వ్రాసింది—

"స్లానిస్లావిస్కీ స్థాపించిన మాస్కో థియేటర్ ప్రదర్శనాలు ఎన్నటికీ మరుపురానివి. వాటికవే సాటి. ఇంతటి ప్రతిభగలవి క్రితంలో చూడలేము, ఇంతలో చూడబోము"
—అని.

ఈ విషయం అక్షరాలా మన రాఘవకు చెందుతుంది. రాఘవకుముందు రాఘవలాంటి నటచక్రవర్తులను మనం చూసివుండలేదు. రాఘవయుగంలో అతనికి సరితూగగలవారు లేనేలేరు. రాఘవ అనంతరం – రాఘవను జ్ఞప్తికి తేగలవారు ఎవరూ పుట్టలేదు. అందుకే స్లానిస్లావిస్కీతో మన రాఘవను పోల్చాను. సిడేన్స్, గారిక్, లుసీన్‌గిట్రి, ఎలెన్ టెర్రి, ఇర్వింగ్, స్టానిస్లావిస్కీల కోవకు చెందినవాడు మన – కళాప్రపూర్ణుడు–నటచక్రవర్తి – రాఘవ. రాఘవ ఉదయించిన రాఘవయుగం రాఘవతోనే అస్తమించింది.

౧౯౨౭ ఆ ప్రాంతాలలో అనుకుంటాను–బ్రిటన్‌కు వెళ్ళి తన నటనాకౌశలాన్ని ప్రదర్శించాడు. ౧౯౨౦ సం|| ప్రాంతంలోనే రాఘవ ఒథెల్లో, షైలాక్, హామ్లెట్, కింగ్ లియర్ పాత్రలకు ప్రసిద్ధిపొందాడు.

బ్రిటన్‌లో లారెన్స్ ఒలీవియర్, లాటన్‌లాంటి ప్రసిద్ధ నటులతో పరిచయంఅయింది. అక్కడ తను గడిం

చిన అనుభవాలను పురస్కరించుకొని, తెలుగు నాటక రంగంలో సృజనాత్మకమైన, విప్లవపూరితమయిన మార్పులు తీసుకువచ్చాడు. నటనలో వుండవలసిన ప్రతి విషయం లోనూ కొత్త మెరుగులుదిద్ది తెలుగు నాటకకళాక్షేత్రంలో ఒక కొత్తచాలు దున్ని నాటువేశాడు మన రాఘవ.

సంస్కృతలాక్షణికులు విభజించిన ఆరువిధాల నవ్వునూ అంటే కనులు వికసించినట్లు నవ్వడం, పళ్లు కొంచెం కనుపించేటట్లు నవ్వడం, తియ్యనైన కంఠధ్వనితో కూడిన నవ్వు నవ్వడం, శిరోభాగం కదిలేటట్లు నవ్వడం, అశ్రువులు జలపూరితములయ్యేటట్లు నవ్వడం, శరీరమంతా కదిలేటట్లు నవ్వడం—ఈ విధాలన్నీ ఆ యా అవసరాలకు తగినట్లు నిరూపించిన నటశిరోమణి ఒక్క రాఘవమాత్రమే.

అటు పాతనీ, ఇటు కొత్తనీ ఆకళించుకొని పాత కొత్తల మేలుకలయికతో - తెలుగు నాటకకళాలక్ష్మికి మేలు కొలుపులుపాడి - తన నటనాకౌశలంతో తెలుగుగడ్డపై మేలుబంతులు విరియింపచేశాడు రాఘవ.

రాఘవఅనుభవాలలో నటకులు నేర్చుకోవలసినదీ -- రాఘవఆశయాలలో నటకులు ఆచరించవలసినవీ చాలా వున్నాయి.

హైదరాబాదులో ఉర్దూనాటకాలలో, కలకత్తాలో హిందీనాటకాలలో—ఇంగ్లీషు మామూలేకదా - ఈయన అనేక పాత్రలుధరించి ఒప్పిస్తూండేవాడు.

జార్జి బెర్నార్డ్‌షా రాఘవ అభినయాన్ని మొదట్లో గుర్తించలేము. కాని, రెండవరోజున రాఘవ ఇంగ్లీషు డ్రామాలో వేసిన పాత్రధారణకు ముగ్ధుడయాడట.

విశ్వకవి రవీంద్రనాథ్‌టాగూరు మన రాఘవ నటనా కౌశలాన్ని - కలకత్తాలో అనుకుంటాను-చూసి తన్మయుడై భారతదేశంలో రాఘవనుమించి ఎవరూ వుండబోరు - అతనికి అతనే సాటి - అని ప్రశంసించాడుట.

అంతటి ఖ్యాతి మన తెలుగు నటకుడైన రాఘవకు ఉంది.

కవికుల గురువు కాళిదాసు శాకుంతలానికి ముగ్ధురాలయిన ప్రపంచము ఇంగ్లండ్ తదితరదేశాలలో రాఘవ నటనాప్రావీణ్యతకు ముగ్ధురాలయింది.

అంతటి ఖ్యాతి మన రంగభూమికి వుంది. అంతటి ప్రతిభ మన నాటకాలకు వుంది. ఆ విలువను, ఆ కీర్తి ప్రతిష్టలనూ తిరిగి అందుకోడానికి - ఇటు నాటక రచయితలూ, అటు నటకులూ బాధ్యతవహించి పనిచేస్తే ఎంతో శ్రమపడవలసిన అవసరం లేదు.

మన నాటక యితివృత్తాలను చూసి ముగ్ధులయిన రాష్ట్రేతరులెందరో వున్నారు. నటననుచూసి ముగ్ధులయి కౌగలించుకున్న రాష్ట్రేతరులూ వున్నారు. ఆ ఖ్యాతినీ, ఆ కీర్తినీ చేపట్టాలి.

నాటకరచన అనగానే చాలమంది చాలా సునాయాసంగా చూస్తారు. అంతకష్టమయింది వేరొకటి లేదు.

కారణం ఏమిటంటే, అందలి యితివృత్తం ప్రేక్షకులను ఆక ర్షించగల్గివుండడం ఒక ఎత్తు, తదుపరి ఆ రచన ప్రేక్షకుల మీాద బాగా పనిచేయడం అనేది ఒక ఎత్తు. వీటికి తగ్గట్టు నటకుడు ఆ కథకు, ఆ భావాలకూ తగ్గట్లు-రచయిత ఆశిం చిన నటనా చాతురితో-భావస్ఫోరకంగా నటించి - నాటక రచనకూ, తనకూ కూడా కీర్తితేవడం మరో ఎత్తు.

ఈ పనులు అన్నీ ఒకదానితో ఒకటి అవినాభావ సంబంధం కలవి. రచన చాలా బాగుందని అనుకొన్నా నాటకం ప్రేక్షకలోకం మన్నన లందుకొనకపోవడం, వేల వంగావుంది యితివృత్తం అనుకున్నరచనకు ఖ్యాతిరావడం మనం చూస్తూన్నదే.

ఈనాడు అనేక పోటీలలో నాటక సమాజాలూ, నాటకాలూ పాల్గొంటున్నాయి. ఒక నటకునికి ప్రత్యేకించి నటనాపటిమకు ఫస్టుప్రయిజ్ వస్తుంది. ఒక రచనకు షీల్డు వస్తుంది. దానినిబట్టి ఆ రచన గొప్పదిగాకాని, ఆ నటకుడు గొప్పవాడనికాని మనం జబ్బలు ఎగరేయనవసరం లేదు. కారణం-అదే నటకుడు-అదే నాటకాన్ని దేశంలో నాలుగు చోట్లా వేద్దామని చూస్తే-ప్రజలు రారు - డబ్బులురావు. కారణం ఏమిటంటారు?

దీనికి సరిఅయిన సమాధానం కీర్తిశేషులు కొప్పరపు సుబ్బారావుగారిమాటలనే ఉటంకిస్తా.

ఒక నటుడు ఒక రాజకుమారుని వేషం ధరిస్తాడు. ఆ రాజకుమారుని వయస్సుకుగాని, హోదాకుగాని అను

గుణ్యమయిన ముఖవర్చస్సు, అంగసౌష్టవం ఆ పాత్రధారిలో కలికానికయినా కనిపించవు. అయినప్పటికీ గమనించదగ్గ విషయమేమంటే—అతడు కొన్ని పద్యాలూ, పాటలూ అమోఘంగా పాడి సామాజికుల ఆమోదాన్ని పొందగలుగుతాడు. ఈనాడు కనిపిస్తున్న ఆమోదాల్లో చాలా భాగం యిలాటివే అని చెప్పడం సత్యదూరం కాదు. అయితే ఉత్తమ కళాదృష్టికి ఇది ఉత్తమ ఆమోదంగా గోచరించడం కష్టసాధ్యం. ఎందుకంటే నాటకరసానుభూతి కేవలం సంగీత ప్రదర్శనద్వారా ఎన్నటికీ ఎవ్వరికీ సాధ్యంకానిపని. కాబట్టి ఉత్తమ నటుడు అనగా ఎవరు? ఉత్తమ నాటకప్రదర్శనం అంటే ఎలాటిది? అనే ప్రశ్నలు అంత సులభంగా పరిష్కారమయ్యేవి కావు.

సాధారణంగా ఎక్కువమంది ప్రేక్షకులు వస్తూవుంటే ఆ నాటకం గొప్పదంటాము. ఏ నటుని చూసి ఎక్కువగా వన్స్‌మోర్‌లూ, కరతాళధ్వనులూ వస్తూంటాయో అతడు ఉత్తమ నటుడుగా తూకం వేస్తాము. అది అంత సులువయిన పనికాదు.

ఉత్తమ కళాఖండంగా వుండే నాటకరచనకు ఆదరణ లాకపోనూపోవచ్చు, ఉత్తమ నటనా చాతుర్యాన్ని గుర్తించలేకపోవచ్చు.

ఈనాడు అనేక రకాల భావాలు వున్నాయి - రచన అనేది ప్రజలకోసం అని, విజ్ఞానాభివృద్ధికోసమనీ, వినోదం కోసం అనీ — యిలా ఎన్నోరకాల అభిప్రాయాలు వున్నాయి.

మన తెలుగు నాటకరచయితలను తీసుకుందాం. కొందరు హాస్యరస ప్రధానమయినవీ, వినోదాత్మకమైనవీ రాస్తుంటారు. మరికొందరు చరిత్రాత్మకమైనవి రాస్తారు. మరికొందరు సాంఘికంగా రాస్తూంటారు. ఎక్కువగా ఈ సాంఘికాలే ఎక్కువ.

ఇవన్నీ యిలా వుండగా, నాటి ప్రధాన సమస్యలను యితివృత్తంగా గొని రచన సాగిస్తారు.

ఏది మంచిది? ఏది చెడ్డది అనేది మనం నిర్ణయించ లేము. కొందరి ఉద్దేశ్యం వినోదం, కొందరి ఆశయం విజ్ఞాన ప్రబోధం, మరికొందరి ఉద్దేశ్యం చరిత్రల ప్రచారం, నాటి సమస్యలను ఎత్తి చూపడం.

దశరూపక కర్త అయిన ధనంజయుడు ఏమన్నాడో వినండి—

"ఆనంద నిష్యందిషురూపకేషు
వ్యుత్పత్తి మాత్రం ఫల మల్పబుద్ధిః
యోపి ఇతిహాసాది వదాహసాధు
తస్మై నమః స్వాధుపరాఙ్ముఖాయ..."

అని పేర్కొన్నాడు. అంటే నాటకం ప్రధాన ఆశయం ఆనందం – అని. మరి యీ విషయాన్ని అందరూ ఒప్పు కుంటారా? అయితే మరి నాటకం ఒక కావ్యవస్తువుగానే కదా మనం గుర్తిస్తున్నాం. విశ్వశ్రేయః కావ్యం అన్నారు కదా! అంటే ఏమిటి ? ఆనందం యిచ్చే కావ్యం విశ్వ కావ్యం అనిపించుకుంటుందా ?

గులాబిలాగా ఆకర్షించగల హుందా, సంపెంగ లాగా ఆకర్షించుకోగల పటిమా వుంటే చాలు ఏ రచన కైనా విలువ వుంటుంది.

నా ఉద్దేశ్యంలో - నాటకం ఎలాగుండాలీ అంటే - ఎంతటి మహారచనకైనా - ఎంతటి విశ్వసందేశం యివ్వ దలచుకున్న బలమైన రచన అయినా - అది చరిత్రాత్మకం కానివ్వండి, రాజకీయం కానీండి, సాంఘికం కానీండి, వినోద లేక విజ్ఞానయుతమైన దవనీండి - దేనిలోనైనా - అన్ని రసాలూ వుండాలి. ఏదైతే రసాత్మకం, కళాత్మకంగా వుంటుందో అదే గొప్పది అన్నమాట.

ఎంత కళాపూరితం అయినదైనా - అందులో ఏ రసం పన్నగిలినా - గంధంలేని సుగంధమే అది, వాసనలివ్వని సంపెంగే అది.

రచన అనేది అన్నివిధాలా పరిపూర్ణత్వం సిద్ధింప చేసుకోవాలి. అందులో మెదడుకు కొంచెం మేతా వుండాలి. కంటికి యింపూ కావాలి. చెవికి సొంపుగానూ వుండాలి. అందుకుతోడు ఆనందోపమానంగా వినోదయు తంగానూ వుండాలి.

వినోదం అనేది మధ్య మధ్యన అవసరం కనుకనే - కాళిదాసాది మహాకవుల దగ్గరనుంచి నేటిదాకా వినోదం కోసం ప్రత్యేకంగా ఒక పాత్రను సృష్టించి - ఆ పాత్రకు రంగు పూసి - చొక్కా తొడుగుతున్నాము.

సంస్కృత నాటకాలలో విదూషకుడూ, అలాగే కన్యాశుల్కంలో గిరీశం, తోలుబొమ్మల్లో జుట్టుపోలిగాడు, బంగారక్క, యక్షగాన నాటకాదులలో సింగీ సింగడూ, కోణంగి పాత్రలు ప్రత్యేకం - చదువరుల, ప్రేక్షకుల వినోదం కోసమే.

అందుకు నాటి మహాకవులు విలువగలిగిన పెద్ద పాత్రతో ఈ పాత్రలకూ ప్రాముఖ్యం యిచ్చారంటే - విజ్ఞానంతోపాటు, వినోదం కూడా నాటకరచనకు అవసర మని గుర్తించబట్టే కదా.

అందుకు రచన అటు విజ్ఞానయుతంగానూ వుండాలి - వినోదాత్మకంగానూవుండాలి. విజ్ఞాన వినోద సమ్మేళనంతో మేటి కళాఖండంగా కాంతిపుంజాలను విరజిమ్మాలి.

మన దృశ్య కావ్యాలకూ పాశ్చాత్యుల దృశ్యకావ్యాలకూ కొంతభేదం వుంది. అది నిజం. అది మనం చూస్తూన్నదే. అసలు మన కావ్యదృష్టి, కావ్యసృష్టి వేరు - వారి దృష్టి వేరు. మనకు రసం ప్రధానం "కావ్యేషు నాటకం రమ్యమ్"అన్నారు.

నాటిక బిగువుగానూ, పటుత్వంగలదిగానూవుండి, నడకల్లో, సంభాషణలో జిగీ బిగీ వుంటే నాటిక బాగా రక్తి కడుంది. సంభాషణల యింపుసొంపులతోపాటు పాత్రల పురోగమనంతోపాటు - ప్రేక్షకులుకూడా -ముందుకు - యింకా ముందుకు - ఏం జరగబోతుందోనన్న ఉత్సుకతతో పరుగెత్తాలి. అప్పుడే రచనాశిల్పం విలువ అన్నమాట.

నాటిక రచనలో అనవసర ఉపోద్ఘాతాలూ, ఉపన్యాసాలూ వుండకుండా, కథ సంగ్రహంగానూ, చిక్కగానూ, సూటిగానూ వుండి – ప్రేక్షకుల హృదయాలను ఆకర్షించ గలిగే యితివృత్తం ఎన్నుకోవాలి. అది నాటికా రచనకు రచయిత తీసుకోవలసిన కట్టుబాట్లు, కర్తవ్యాలు.

మొట్టమొదట ఏకాంకికల రూపాలను సాక్షాత్కరింప చేసింది ప్రవేశపెట్టింది శ్రీ గుడిపాటి వెంకటచలంగారని చదివిన జ్ఞాపకం.

నాటికా రచయితలలో ప్రముఖులుగా శ్రీ పి. వి. రాజమన్నారుగారూ, ముద్దుకృష్ణగారూ, బుచ్చిబాబుగారూ, కొప్పరపు సుబ్బారావుగారూ, ఆచార్య ఆత్రేయగారూ, సుంకర, వాసిరెడ్డిగార్లూ, మొదలుగాగలవారు – యింకా ఎందరో వున్నారు.

రేడియో రూపకంలో విద్వాన్ విశ్వం, గోరా శాస్త్రి అని పెట్టి, ఆచంద్రలాంటి రచయితలు చాలామంది వున్నారు.

కొత్తగడ్డ అని ౧౨ నాటికల సంపుటిని రచించినది శ్రీ నార్లవారు. ఇందులో సహజసంభాషణలూ, గ్రామ రైతుకుటుంబాలలో వాడే సత్తువ సారం కల మాటలూ వ్రాసి సిద్ధహస్తులనిపించుకొన్నారు శ్రీ నార్లవారు.

నేటి సమస్యలను తీసుకొని, వాటికి రూపకల్పనచేసి వాటిద్వారా ప్రజలకు సందేశం యివ్వడంలోనే నాటికల విజయం ఆధారపడివుంటుంది అని నా నమ్మకం.

పూర్వకాలంలో నాటకాలు అదేపనిగా, రాత్రి అంతా ఆడేవారు. అది చూడడానికి అలాగే ఓపికగా కూర్చునేవారు. కాని, నేడు కాలం విలువ ఎక్కువయింది. ఏదో పనిలో ప్రతివారూ మునిగివున్న ప్రస్తుతకాలంలో ప్రేక్షకులలో అంత ఓపిక లేదు.

అందుకు తగినట్లుగానే నాటకాల నిడివి తగ్గింది. ప్రస్తుతం ౩ గంటల నాటకం కంటే లేదనే చెప్పవచ్చును. నాటకం ఎంత పొడుగుందనికాకుండా — అందలి శిల్పం ఎంత విలువైందీ అన్నది మనకు ప్రధానం కావాలి. రెండుగంటల చాటభారతంకన్నా ౩౦ నిముషాల అనాసందేశం చాలు.

రాఘవ అడుగుజాడల్లో నటకులూ, గురజాడ బాటల్లో రచయితలూ నడక సాగించాలి. అప్పుడు మనం ఆశించిన ఫలితం అందుకోగలం.

సినిమాలధాటికీ, నాటి మెరుపు వయ్యారపు సింగారాలకూ తట్టుకోలేక వెనుకబడిన నాటకరంగం, ఆదరణా ప్రోత్సాహం సన్నగిలి, నిరుత్సాహ నిస్తబ్ధతలకు ఆలంబనమైన మన నాటకరంగం, తిరిగి కొత్త కొత్త వనలుతొడిగి పచ్చగా పూచి పుష్పించాలంటే, పూర్వపు ఔన్నత్యాన్ని అందుకోవాలంటే - అన్నిరంగాలనుంచి, అన్ని వెంపుల నుంచీ, అధికారయుతంగానూ, అనధికారయుతంగానూ ఎంతో కృషిజరుగవలసియున్నది. అందుకు ఆంధ్రప్రదేశ్ సంపాదించుకున్న ఈ శుభతరుణం ఎంతో అనుగుణమైనది.

'నాటకాన్తం హి సాహిత్యం' అని ప్రాచీన నానుడి. కాని మన ప్రభుత్వంకాని, తదితరులుకాని నాటకకళపట్ల ఏమీ శ్రద్ధ తీసుకోడంలేదు.

నాటకకళాపరిషత్తూ, విశ్వకళాపరిషత్తులాంటి సంస్థల ద్వారా, లిటిల్ థియేటర్, ప్రజానాట్యమండలిలాంటి సంఘాల ద్వారా ఈ కృషి జరగడం – అందుకు ప్రభుత్వ ప్రోత్సాహం, ప్రజల, కళాభిమానుల ఆదరణా, ఆశీస్సులూ చాలా అవసరం.

ఇంకా మనం యిలాగే స్తబ్ధతతో ఈసురోమని కూర్చుంటే మన అపురూపమయిన జానపద కళాఖండాలు రూపుమాసిపోయే ప్రమాదంవుంది – కనుక ప్రాచీనకళలను సంస్కరించుకుని, పునరుద్ధరించుకొని – నూతన శకంలో అడుగేసిన మనం – తెలుగు నాటకరచనలో, రంగప్రదర్శనలో నవనవోన్మేషంగా ముందుకు సాగిపోవాలి.

ప్రపంచ నాటకరంగంలో – ఆంధ్రకళాలక్ష్మికి జోహార్లు అందుకోవాలి. అందుకు నటచక్రవర్తి రాఘవునీ, రచనాశిరోమణి గురజాడనీ తలచుకొని– వారి సందేశాలను అర్థం చేసుకుని – తెలుగు నాటికాక్షేత్రంలో యింకా నవీనమైన, సృజనాత్మకమైన నేలుబంతులు వెలయించడం కోసం – ముందుకు సాగిపోదాం.

తెలుగు రంగభూమిని నిత్య వసంతభూమిగా అలరించుకొందాం.

"భారతాది కథలు చీరనురగునా(రంగ
బొమ్మలనాడించువారు
కడు నద్భుతంబుగ గంభసూత్రంబు
లడరంగ బొమ్మలనాడించువారు—"

అని పండితారాధ్యచరిత్రలో పాల్కురికి సోమనాథుడు పేర్కొనివుండడంబట్టి, ౧౨వ శతాబ్దినాటికే ఈ చీర వెనుక బొమ్మలప్రదర్శనం వుండేదని మన మూహింపవచ్చును. అంతటి ప్రాచీనమయిందీ, చరిత్రాత్మకమైందీ ఈ తోలుబొమ్మల - కళ - ప్రదర్శనాలు.

త్రిలింగదేశంలో - అంటే అటు సర్కారులలోనూ, ఇటు తెలంగాణము, రాయలసీమలలోనూ - ఎన్నో వందల సంవత్సరాలనుంచి - ప్రజాభిమానం పొందుతూ ప్రజలచేత ఆదరింపబడుతూ గౌరవించబడుతూ, రాష్ట్రేతర ప్రాంతాలకేకాక - ఖండాంతరాలలోకూడ స్థానంసంపాదించి - ప్రచారంపొంది - తెలుగువారి ప్రాచీనకళాఖండాలలో మొట్టమొదటిదిగా పేరొందినట్టిదీ పేర్కొనదగినదీ ఈ తోలుబొమ్మల ప్రదర్శనాలు.

తెలుగువారి ప్రాచీన కళావైదగ్ధ్యాన్ని ఆంధ్రనుంచి జావా, బోర్నియో మొదలగు దేశాంతరద్వీపాలవరకూ వెదజల్లి తెలుగుకళాలక్ష్మికి నీరాజనాలందింప జేసినది, రూపురేఖలుదిద్దినది ఈ తోలుబొమ్మల ప్రదర్శనాలే.

కాలప్రవాహంలో అనేక ప్రాచీనకళలు ఆదరణ, పోషణ అనేది లేక కనుమరుగైపోయినా, ప్రతిపల్లెకూ, పట్నానికీ, సినిమాలు అందుబాటులో వుండి ఎంతో ఆనందాన్ని అందిస్తున్నా - తెలుగువారి ప్రాచీనకళాఖండమనదగిన ఈతోలుబొమ్మలప్రదర్శనాలను మాత్రం ఈసినిమాలు మరపించలేకపోయాయి. అదేకాదు, తెలుగు గ్రామసీమల్లో ఈ ప్రాచీన కళాలక్ష్మి నేటికీ ఎంతో ముచ్చటగా ఆనందాన్ని అందిస్తూంది.

ఈ తోలుబొమ్మలప్రదర్శన మొట్టమొదట మహారాష్ట్రదేశంలో ఆరంభమైనదని ప్రచారంలో వుంది.

ప్రాచీన తమిళవాఙ్మయంలో ఈ తోలుబొమ్మల ప్రదర్శనాలను గురించి పేర్కొనబడివుందికూడా. మన తోలుబొమ్మలనే తమిళవాఙ్మయంలో తోల్పావై అని పేర్కొన్నారు.

ఈ తోలుబొమ్మలకళకు రానురాను మహారాష్ట్రదేశంలో ఆదరణ పోషణ లేకపోవడంచేతనైతేనేమి, అక్కడి జొన్నకూడు తినలేకనైతేనేమి తెలుగుదేశానికి ఈ మరాఠీ తోలుబొమ్మల ప్రదర్శకులు - పొట్టచేతపట్టుకుని వచ్చేశారని పరిశోధకుల భావన.

తెలుగుదేశపు నదీజలాల తియ్యదనమూ, తెలుగు భూముల వరిబియ్యపు కమ్మదనమూ రుచిమరగి యిక్కడనే స్థిరనివాసం ఏర్పరచుకొన్నారని కొన్ని ఆధారాలవలన మనకు తెలుస్తూంది. అదీకాకుండా పీరు మహారాష్ట్రదేశం

నుంచి మన దేశానికి వచ్చారని చెప్పడానికి రెండు బలము యిన కారణాలు కనిపిస్తున్నాయి. అందులో మొదటికారణం ఈనాటికీ తెలుగుదేశంలో ఈ తోలుబొమ్మల ప్రదర్శకులు మాట్లాడే భాష మరాఠీ. రెండవకారణం వీరి నామధేయములు ఎక్కువగా మహారాష్ట్ర సరిహద్దువే అయి వుండడం.

వీరి పేరిట—అంటే ఈ తోలుబొమ్మలప్రదర్శకుల పేరిట - ఒక గ్రామంకూడా వుంది, బళ్ళారిజిల్లాలో బొమ్మలాటపల్లి అని. ఇదే వీరి మొట్టమొదటి నివాసంగా పేర్కొన్నారు. వీరి పూర్వులు మహారాష్ట్ర సంప్రదాయకులు.

ఆంధ్రులకూ అరవలకూ సోదరులుగా ఎలా పొత్తు వుందో - అంతకంటె ఎక్కువగా - మహారాష్ట్రులకూ ఆంధ్రులకూ పొత్తువుంది. మన లిపిద్వారా, ఆచార వ్యవహారాలద్వారా అనేకవిధములుగా మహారాష్ట్రులకూ, ఆంధ్రులకూ దగ్గరి సంబంధం కనిపిస్తుంది, పొత్తు అగుపిస్తుంది.

తరతరాలుగా కట్టులో, బొట్టులో నిత్యజీవిత వ్యవహారాలలో - నిత్యసంబంధం అనుయాయంగా వస్తూంది.

ఇప్పటికీ కన్నడం, మహారాష్ట్రం మాట్లాడే తెలుగువారు బళ్ళారిలో లేకపోలేదు. వీరందరూ తెలుగువారుగానే చెల్లుబడి. ఆ శాఖకు చెందినవారే ఈ తోలుబొమ్మల ప్రదర్శకులు.

వీరిని మహారాష్ట్రదేశంలో బొందిలీ క్షత్రియులని అంటారు. వీరు చక్కటి సుస్వరద్రూపులు. చక్కటి రూపు రేఖావిలాసాలూ, తరతరాలుగా పుట్టడంతోనే వచ్చే కంఠ ధ్వనీ వీరి ప్రత్యేక లక్షణాలు. 'అచటపుట్టిన చిగురుకొమ్మైన చేవ' అన్నట్లు వీరియింటపుట్టే ప్రతికుర్రవాడూ మంచి పాటగాడే. ఉల్లియ మల్లియగానే, కాకికి కోకిల పుట్టునే అన్నట్లు వీరి కడుపున చక్కని పాటగాళ్లు పుట్టక యింకెవరు పుడ్తారు?

వీరికి ఉన్న ఆస్తిఅల్లా ఈ తోలుబొమ్మలే. అవే వారి జీవితం – అవే వారి సర్వస్వం. మనం భూములనూ, డబ్బునూ పంచుకున్నట్లుగానే – వారు తమ తోలుబొమ్మలను వాటాలుగా పంచుకొంటారు. అలా పంచుకోగా వచ్చిన ఆ బొమ్మలను పెద్దల సంపాదనగా మహాప్రసాదంగా గౌరవంగా చూసుకుని, దాచుకుని, పూజిస్తారు. వీరు ఎక్కువగా రంగనాథరామాయణగాథనే ప్రదర్శిస్తూవుంటారు.

తోలుబొమ్మలను తయారుచేయుటకు చాలా ఓపిక, నేర్పు కావాలి. మానవాకృతులను చర్మంలో మలచాలి. అందుకు వారికి చక్కని చిత్రకళానైపుణ్యం, శిల్పభావనా పటిమ కావాలి. ఈ తోలుబొమ్మలను రెండురకాల చర్మా లతో తయారుచేస్తారు. రెండురకాల చర్మాలను ఉపయో గించడంలో ఒక ప్రత్యేకత కనిపిస్తుంది. అవి—ఒకటి జింకచర్మం, రెండు మేకచర్మం.

౧. జింకచర్మం: ఈ చర్మాన్ని దేవతావిగ్రహాలను తయారుచేయడానికే ఉపయోగిస్తారు. యిలా దేవతావిగ్రహాలకు జింకచర్మాన్ని ఉపయోగించడం వారికి పవిత్రమయిన దేవతాస్వరూపాలమీదవుండే భక్తిభావంతోనే.

౨. మేకచర్మం: ఈ చర్మాన్ని రాక్షసబొమ్మలకు ఉపయోగిస్తారు. ఈవిధంగా జింకచర్మాన్ని ఉపయోగించకుండా అంతకంటే తక్కువ విలువగలిగిన మేకచర్మాన్ని ఉపయోగించడంలో పరిభావం రాక్షసత్వంమీద వారికున్న అసహ్యమే.

పేరు—ఈ తోలుబొమ్మల ప్రదర్శకులు మహారాష్ట్రదేశం వదలి తెలుగుభూమిపై ఏనాడు అడుగుపెట్టారో—నాటినుంచీ కొడిగట్టుతూన్న జ్యోతి తిరిగి దేదీప్యమానంగా వెలుగొందసాగింది. తిరిగి ఈ తోలుబొమ్మలకళకు చక్కని ప్రచారం, పోషణ, ఆదరణ లభించాయి.

తిరిగి తోలుబొమ్మలకళ తెలుగునాట మూడు పూవులూ, ఆరుకాయలూ తొడిగి నవనవోన్మేషమై నిలచింది.

ఇటువంటి వాతావరణంలో ఈ బొమ్మలప్రదర్శనాన్ని చూచిన కొంతమంది గోదావరీతీరవాసులలో కొందరు తాము కూడా తోలుబొమ్మల ప్రదర్శనాలిచ్చి ధనం, కీర్తి, ప్రతిష్ఠలు సంపాదించవలెననే తలంపుతో ఒక దళంగా ఏర్పడి తోలుబొమ్మల ప్రదర్శనాలు యివ్వనారంభించారు. అలా పోటీగా ప్రదర్శనాలు మొదలుపెట్టిన గోదావరీతీరవాసు

లను గురించి చిన్నగాథ ఒకటి ప్రచారంలో వుంది. అదేమిటంటే—తోలుబొమ్మలకు రెండే రెండురకాల చర్మాలు — జింక, మేకచర్మాలు ఉపయోగించడం ఆచారంగా వస్తూంది— ఎద్దుచర్మం ఏనాడూ తోలుబొమ్మలతయారీకి నిషిద్ధమే.

ఎద్దుచర్మం తోలుబొమ్మలతయారీకి ఎందుకు నిషిద్ధమయిందంటే — ఎద్దుచర్మం కాలిచెప్పులకు వుపయోగిస్తారు కనుక. అటువంటి చెప్పులుకుట్టే ఎద్దుచర్మాన్ని ఈ తోలుబొమ్మలరూపంలో వుండే దేవతాబొమ్మలుగా చేసి పూజించినయెడల అది చెప్పులను పూజించినట్లేనని తోలుబొమ్మల ప్రదర్శకుల పూర్వకాల అభిప్రాయం—అదేకాదు—గాఢమైన నమ్మకం.

అందుకే తరతరాలనుంచీ ఈ తోలుబొమ్మల తయారీకి ఎద్దుచర్మం నిషిద్ధం.

కాని ఈ పోటీ ప్రదర్శనలు ప్రారంభించిన గోదావరీవాసులు ఖరీదుగావుండే జింకచర్మాన్నిగాని మేకచర్మాన్నిగాని ఉపయోగించక — చౌకగా దొరుకుతుందనే ఉద్దేశ్యంతోనో, తెలియకనో ఎలాగైతేనేమి నిషిద్ధంగాచూస్తూన్నయీ ఎద్దుచర్మాన్ని వాడారని — ఆచారంగావస్తూన్న కట్టుబాటుకు వ్యతిరేకంగా నడచుకొని మహాపరాధం చేయుట మూలంగా వారు ఈకళలో విజయం సాధించలేక — గణనకెక్కలేక — ఆదరణ పొందలేక — చివరకు ఈ ప్రదర్శనాలు తమకు అచ్చిరాలేదనితలచి విరమించుకున్నారని చెప్తారు.

తెలుగువారు ఎందరో తెలుగుదేశంవదలి - మల బారు ప్రాంతానికి వలసపోయారు. అదేకాదు, కొంతమంది ఖండాంతరాలకు కూడా వలసవెళ్ళారు. అలా వలసపోయిన తెలుగువారు జావా, బోర్నియో మొదలగు దేశాంతర ద్వీపాలలో స్థిరనివాసం ఏర్పరచుకొని - అక్కడకూడా వారి ప్రాచీన కళ అయిన యీ తోలుబొమ్మల ప్రదర్శనా లను యివ్వడం ప్రారంభించారు. తెలుగువారి ఈ కళకు దేశాంతరద్వీపాలలోకూడా చక్కని ప్రచారం లభింప చేశారు.

అప్పటికే తెలుగునాడులో ఎంతో పేరుప్రఖ్యాతులు సంపాదించుకొని, ఎంతో ఆదరింపబడుతోంది ఈ తోలు బొమ్మల కళ. నేటికీ మన ఆంధ్రదేశంలోలాగానే దేశాం తరద్వీపాలయిన జావా, బోర్నియో మొదలగు ప్రదేశా లలో ఈ ప్రదర్శనలు అమలులోవున్నాయి. అమలులోవుండ డమేకాదు - అక్కడి ప్రజలలో రానురాను ఈ తోలుబొ మ్మలకళ తమ చారిత్రకకళే అనే భావం కలుగజేశాయి ఈ ప్రదర్శనాలు.

ఈ తోలుబొమ్మల ప్రదర్శనాలు ఎక్కువగా గ్రామా లలో యిస్తూంటారు. వీటికి గ్రామవాసులు చక్కని ఆదరణ చూపుతూంటారు.

ఈ ప్రదర్శనాలు ఎక్కువగా గ్రామాలలో - చిన్న చిన్న దేవాలయాలవద్దగాని, మందిరాలవద్దగాని, పెద్దపెద్ద ఉత్సవాలసందర్భాలలోగాని ప్రదర్శిస్తూంటారు. ఈ ప్రదర్శ

నాలుగు వేలకొలదీ జనం—హెచ్చుతగ్గుల భేదాలు లేకుండా వచ్చి, చూసి ఆనందిస్తూ వుంటారు. ఆనందించడమేకాదు – ఆ కథాగమనంలో వచ్చే పాత్రలలో లీనమైపోతారు. వారి కష్టసుఖాలలో పాలుపంచుకుంటారుకూడాను.

కష్టాలతో కూడిన ఘట్టములు చూస్తున్నప్పుడు కనులనుండి నీరుపెట్టుకునీ, కౌర్జన్యచర్యలతో కూడిన ఘట్టములు చూస్తున్నప్పుడు మండిపడుతూ, హాస్యసంభాషణలతో జుట్టుపోలిగాడు, బంగారక్క తెరకెక్కినపుడు మహానందం అనుభవిస్తూ, ఆ యా ఘట్టాలతో, పాత్రలతో లీనమై పోతారు ప్రేక్షకులు. అందులోనూ పండితులు మొదలు కొని పామరునివరకూ – ఆటముగింపయ్యే వరకూ ఓపికతో వుండి మునిసిపోవడం ఒక ప్రత్యేక విశేషం.

అటువంటి కళాసమన్వితమయిన ఈ తోలుబొమ్మల తయారీలోనే గొప్ప కళానైపుణ్యం, చిత్రనైపుణ్యం మనకు కనిపిస్తుంది.

సినిమాలలోలాగా ఏ సాంకేతిక పరిజ్ఞానమూ అవసరం లేకుండా, ఏ కృత్రిమదృశ్యకల్పనా కనిపించకుండా వుండే కళగా కనబడేది ఈ తోలుబొమ్మల కళ ఒక్కటే. ఈ తోలుబొమ్మల ప్రదర్శకులు వారి ప్రదర్శనాలలో చాలా రకరకాలయిన చారిత్రక కథలు చూపిస్తారు. కాని ఎక్కువగా ప్రధానంగా ప్రదర్శించేది రంగనాథరామాయణగాథే.

## ప్రదర్శనవిధానము

కథనడపడానికీ, కథలోని వివరం చెప్పడానికీ తెర లోపలనే ఒకరు వుంటారు. ఆవ్యక్తి చాలా చురుకైనవాడుగా వుంటాడు.

అతడు కథను అనేక తరహాలలో - పద్ధతులలో గేయాలుగాను, పద్యాలలోనూ, వచనంలోనూ నడుపుకు పోతూవుంటాడు. ఇలా కథను నడిపించే వ్యక్తిలో మనకు కనుపించే గొప్పతనమల్లా - పాత్రలనుబట్టి, గొంతును మార్చుతూ మాట్లాడడంలోనే.

రావణాసురుని దౌర్జన్యచర్యల వర్ణన విని మండి పడకుండావుండడం ఆ సమయంలో చాలా కష్టం. అలాగే సీతాదేవి అశోకవృక్షంక్రింద రాక్షసబాధలననుభ విస్తూ, దుఃఖిస్తూవుండడం వర్ణించి చెబుతున్నప్పుడు ఎంతటి కటిక రాతిగుండె మానవుడైనా ఆసమయంలో కన్నీరు నింపకుండా వుండలేడు. దీనినిబట్టే ఈ ప్రదర్శన ఎంతటి ఉన్నతస్థాయిలో నడుపబడుతుందో ఊహించుకొనవచ్చును.

ఈ తోలుబొమ్మల ప్రదర్శనం సుమారు రాత్రి ౧౦ గంటలు మొదలుకొని తెల్లవార్లూ కొనసాగుతుంది. ఇంత సేపు ప్రదర్శనచూసి విసుగుచెందకుండా మధ్యమధ్య బంగా రక్క, జుట్టుపోలిగాడు వచ్చి తమ సహజసిద్ధమయిన హాస్యధోరణిలో సంభాషిస్తూ ప్రేక్షకులను నిద్రపోనివ్వ కుండా విసుగుచెందనివ్వకుండా గిలిగింతలుపెడ్తారు. ఈ ప్రద

ర్శనాలలో ముఖ్యవిశేషం ఏమిటంటే వంతపాట వాడు వారు ముఖ్యంగా ఆడవారైవుంటారు.

వారు పాడే రాగాలలో ముఖ్యంగా – ముఖారిరాగం వాడబడుతూవుంటుంది. కథనడపే సంధానకర్తమాత్రం అందరిలోకీ కొంచెం వాక్శుద్ధికలవాడై వుంటాడు. మధ్య మధ్య అమరంలాంటి పుస్తకాలనుంచి శ్లోకాలుకూడా వల్లిస్తూంటాడు.

ఇప్పటిసంగతికాదు, కాని పూర్వం తోలుబొమ్మల ప్రదర్శకునికి యిద్దరు, ముగ్గురు భార్యలు వుండడం కద్దు. బహుభార్యాత్వం అంత దోషంగా తీసుకోరు వారు.

ఏమిటి యిలా యిద్దరు ముగ్గురు భార్యలను కట్టుకోవ డం వలన లాభం? అని మనకు ప్రశ్న ఉదయించడం సహ జం. దీనివలన వారిదృష్టిలో ఒకలాభం లేకపోలేదు. ప్రద ర్శనకు అవసరమయిన తోడువ్యక్తులను రాగాలపనకు, వంత పదాభినయానికి, శృతివేసేందుకు – ఎలాగా ఎవరినో ఒకరిని తెచ్చుకోవలసియుంటుంది. అలా తెచ్చుకొంటే పరాయి వారైనవీరందరికీ జీతంక్రింద ఏదో కొంతసొమ్ము ముట్టజెప్ప వలసియుంటుంది. అలా ఒక్కొక్కరికే జీతం యివ్వాడ మంటూవాస్తే–చివరకు ప్రదర్శకుడికి మిగిలేది ఏమీ వుండదు.

అందుకని జీతబత్తాలు ఏమీ యివ్వానవసరం లేకుండా– అన్నిపనులూ జరిగిపోయేటట్లు ఇద్దరు, ముగ్గురు భార్యలను కట్టుకుంటారని తెలుస్తూంది. ఒక ఆడగొంతు ప్రదర్శనం మధ్యలో బొంగురుపోయినా, నాటి ప్రదర్శనానికి ఏ ఆటం

కమూ లేకుండా మరో స్త్రీ ఆ స్థానాన్ని సర్దుకుని ప్రదర్శనకు ఏమీ భంగంలేకుండా ఆదుకుంటుంది.

ప్రతి బొమ్మలాటదళంవారికీ, ఒకటి రెండు గుర్రాలో గాడిదలో వుంటాయి వీటివలన లాభంలేకపోలేదు. కాని వీటిని ఏం పెట్టి పోషిస్తారు? అనే అనుమానం మనకు కలగడంలో ఆశ్చర్యంలేదు.

ఒక వూరునుంచి మరొకవూరుకు తోలుబొమ్మల ప్రదర్శన సామానులతో – అందరూ పిల్లా జెల్లా బయలుదేరాలంటే-ప్రయాణఖర్చులక్రింద చాలా వెచ్చించవలసి యుంటుంది. అలా ఖర్చుచేయనవసరంలేకుండాఉన్న సామానునంతటినీ ఆ రెండు గుర్రాలమీదా పేర్చి కట్టి నడిపించుకుంటూ ఒక్కదమ్మిడీ ప్రయాణంకోసం ఖర్చుచేయనవసరంలేకుండా చేరవలసినచోటుకు అంటే ప్రదర్శనాస్థలికి చేరుకుంటారు.

వీటి పోషణసంగతి : విడిదిదిగిన గ్రామంలో వీథుల వెంట వాటిని అంటే ఆ గుర్రాలను వదిలేస్తారు. అలా వదలబడిన గుర్రాలు వీథులలోని పచ్చగడ్డిని, తోటగట్ల రెల్లునూ మేస్తూ కడుపునింపుకుంటాయి. తిరిగి ఆ గుర్రాలు అవసరం వుంటేనేకాని ఎక్కడవున్నదీకూడా వెతకరు. అలా రాత్రి, పగలూ మేస్తూ తిరుగుతూనే వుంటాయి.

ముఖ్యంగా ఈ తోలుబొమ్మల ప్రదర్శనానికి కావలసిన సామానులు కొద్ది మాత్రమే. అవి అయినా శ్రమ లేకుండా సంపాదింపదగ్గవే. ఒక తెల్లని తెర. ఇది ఆ గ్రామ

చాకలిని అడిగితే యిస్తాడు"- తోలుబొమ్మలు సరేసరి. ఒక బల్ల, ఏ గ్రామకరణాని అడిగినా దొరుకుతుంది. హార్మోనియం, తాళాలు, పెట్రొమాక్స్ లైట్లు.

ఏ గ్రామంలో అయితే ప్రదర్శించదలుస్తారో ఆ ప్రదేశంలో అందరికీ అందుబాటులోవుండేలా అందరికీ కనిపించేలా - మధ్య ప్రదేశంలో స్థలనిర్ణయంచేస్తారు. అక్కడ మూడువైపులా మూయబడి ఒక ప్రక్క తెల్లని తెరకట్ట డానికి వీలుగా సరిహాసి - పందిరి వేస్తారు - ఆ తెరను ప్రేక్షకులకు ఎదురుగా నిర్మిస్తారు.

పందిరిలోపలిభాగాన తెరను ఆనుకొని పెద్ద బల్ల ఒకటి వేస్తారు. ఆ బల్లకు రెండువైపులా రెండు పెట్రోమాక్స్ లైట్లు వ్రేలాడకడతారు. వీటికి బదులు పూర్వకాలంలో ఆముదం దీపాలు వెలిగించేవారు ప్రదర్శనకు ముందుగా వినాయకుని బొమ్మను తెరమీదకు ఎక్కించి ప్రార్థనచేస్తారు.

పందిరిలోపల నేలమీద ఒక చాపపర్చుకుని హార్మోనియం వాయించేవారు ఆసీనులౌతారు. అక్కడే తాళాలు వాయించేవారూ కూర్చుంటారు. తెల్లవార్లూ ఆటసాగుతూనే వుంటుంది. కనుక అక్కడనే పిల్లల పడకలూ, పాలిచ్చుకోవడాలూ, టీ కాచుకోవడాలూ మొదలగు పనులన్నిటికీ వీలుగా లోపల అనువు చేసుకుంటారు.

బొమ్మలను పలుచని చర్మంతో తయారుచేస్తారు. తోలును కావలసిన రూపాలలో కత్తిరించి వాటికి ముదురు



చిత్ర శిల్పకళాసమన్వితమైన
కొండపల్లి
బొమ్మలు
బాలల సృజనాత్మక శక్తికి పట్టుకొమ్మలు...

చిరునవ్వులు చిందిస్తూ, పాలబుగ్గలతో పసిడిభావాలతో వచ్చీరాని పలుకులతో, తూలిపడబోయే నడకలతో విచిత్రమైన యక్షప్రశ్నలు వేస్తూ-అంతలోనే అలిగి మూతి ముడుస్తూ - అంతలోనే చంద్రుని చూసి వికసించిన పద్మంలాగ ముఖమింతచేసుకొని నవ్వులు జల్లులుగా కురిపించే పాపలను చూస్తే పెద్దలకు ఎంత ఆనందమో!

అలాగే రంగు రంగుల అలంకరణల మధ్య వింత వింత రూపాలతో ఆకారాలతో వుండే - రకరకములయిన పక్షి, జంతువు, మనిషి మొదలైన ఆటవస్తువులను చూస్తే పసిపిల్లలకు కలిగే సంతోషం-పొందే ఆనందం చెప్పలేము.

ఆ లక్కపిడతలమధ్య- రంగు రంగులలో మెరుస్తూ-పిలచినట్లు జీవంతో వున్నాయా అన్నట్లు వుండే కొండపల్లి బొమ్మలు చూస్తే పసిపిల్లలకు అమ్మ ఎక్కడుందో, ఆకలి వేస్తూందేమోనన్న ధ్యాసే వుండదు - మరచిపోతారు కూడాను.

అదే ఆటవస్తువులలో వుండే ఆనందం - కొండపల్లి బొమ్మలలో వుండే గొప్పతనం. ఈనాడు ప్రపంచ దేశాలన్నిటా - పెద్దలకు సంబంధించిన విషయాలకు ప్రాధాన్యత యిచ్చినట్లుగానే పిల్లలవిషయాలకుకూడా ఎక్కువ ప్రాధాన్యత యిస్తున్నారనేది నిర్వివాదం.

సుందరమైన పెద్దపెద్ద భవంతులూ, నందనవనాల లాంటి తోటలూ, కన్నులకింపైన ఫర్నిచరు - చూడగానే

ఆకర్షించే అలంకరణలకూ యిచ్చే ప్రాధాన్యతతోబాటు బాలలుచూసి మురిసే ఆటవస్తువులుకూడా ఈనాడు యిళ్ళలో ఒక అలంకారంగా గుర్తించేరు. అంటే భవిష్యత్తులో బాలల గురుతర బాధ్యతలను వీరు గుర్తించారన్నమాట.

బాలల ఆటవస్తువులకిగాని, బాలల సాహిత్యానికిగాని, బొమ్మలకళకుగాని యితరదేశాలలో యిచ్చినంత ప్రాధాన్యత, తీసుకున్నంత శ్రద్ధ మనదేశంలో మన పెద్దలు తీసుకున్నట్లు అంతగా కనబడదు.

పిల్లలు మైనుబొత్తంలాగ ఎటు వంచితే అటు, ఎటుమళ్ళించితే అటు మళ్లే మన స్తత్వము కలవారు. వారి చుట్టూ వుండే సంప్రదాయాలకు, భావాలకు యిట్టే ఆకర్షించబడి, ఆ ప్రభావానికి లోనయ్యే మన స్తత్వం వారిది.

భయం అంటే ఏమిటో, అబద్ధం అంటే ఏమిటో తెలియదు పసిహృదయాలకు. రాను రాను మనం-బూచాడు వస్తున్నాడని, పిల్లి వస్తూoదని భయం నేర్పడంద్వారా భయాన్ని అర్థంచేసుకొని భయస్తులౌతారు. అలాగే, 'నాన్నగారికి చెప్పకే జీడిపప్పు కొన్నానని' అని తల్లి భర్తకు జడిసి నేర్పే అబద్ధాలు సునాయాసంగా పసిపాపమీద పనిచేస్తాయి. అబద్ధాలకు సునాయాసంగా దగ్గరవారౌతారు.

కాని - పిల్లలను చక్కని వాతావరణంలో వుంచి, వారి చుట్టూ పరిసరాలను తగినట్లు వుంచగలిగితే భవిష్యత్తులో వారు చక్కని వ్యక్తులుగా తయారవుతారనడంలో సందేహం అక్కర్లేదు.

పరిసర ప్రభావాలనుబట్టి మార్పులు సులువుగా కలుగుతాయి. ఇది మనకంటే పాశ్చాత్య మన స్తత్వ వేత్తలు, పెద్దలు - బాధ్యులు ముందు గుర్తించారనే అనుకోవలసి వుంటుంది.

పిల్లల జీవితాలను తేజోవంతంచేసేపనులు ఎన్నో యీనాడు అమెరికా, రష్యా మొదలగు దేశాలలో జరుగుతున్నాయి. బాలలకు ఉత్సాహాన్నీ, సంతోషాన్నీ యిచ్చే బొమ్మలను తయారుచేయడంతోటే వారు సంతృప్తిపడక, ఆ వస్తువుల నిర్మాణపు కళయొక్క ప్రాథమికవిషయాలలో కూడా బాలలకు పరిచయం ఏర్పరచగల బొమ్మలను నిర్మించి చూపుతున్నారు.

అలాగే పిల్లలతో వేయించే డ్రాయింగుల విషయంలో కూడా. బొమ్మకు వేసేరంగు అలంకరించే దుస్తుల విషయంలో పిల్లలు తమ కళాభిరుచిని వ్యక్తంచేయగలట్టివి తయారుచేస్తున్నారు.

అంటే పిల్లలకు ఎంత ప్రాధాన్యం, పిల్లల బొమ్మలకు ఎంతటి విలువ యిచ్చారో మనకు అర్థమవుతుంది.

ఆఖరికి వారు — బాలల ఆటబొమ్మలను తయారు చేసేవారు ఎంతటి ప్రత్యేకశ్రద్ధ తీసుకున్నారో చూడండి.

కాలానికి తగిన బొమ్మలను — వర్షాకాలంలో నీటికి పాడవనివీ, ఎండాకాలంలో వేడికి దెబ్బతిననివీ, శీతాకాలంలో దెబ్బతిననివీ — యిలా ఋతువులనుకూడా దృష్టిలో

పెట్టుకుని పిల్లల మన స్తత్వాలకు సరిపడేటటువంటి - తల్లులకు పిల్లల పెంపకంలో ఎంతో సహాకరించే పద్ధతిలో ఈబొమ్మల నిర్మాణం జరుగుతోంది.

అమెరికాలో - ఆర్థర్ కెరారా అనే అతను వర్షా కాలంలో ఇంట్లోవుండి ఆడుకోడానికి పనికివచ్చే ఆటబొమ్మలను - మెగ్నెట్ మాస్టర్ అనే దానిని—తయారుచేసి అమెరికాలో పిల్లల తల్లుల అభినందనాలుఅందుకున్నాడుట.

ఇటువంటి ఒక ఆటవస్తువును చూసిన ప్రముఖ అమెరికన్ చిత్రకారుడు ఏమన్నాడో చూడండి:

"పీటివల్ల పిల్లలకు ప్రాథమికమయిన చిత్రణలో పరిచయం ఏర్పడుతుంది. అంతేకాదు, అటువంటి బొమ్మలతో వీరు ఆడుకోనడంవల్ల తమకు తెలియకుండానే నిగూఢమైన ఓ కళాప్రపంచంలోకి ప్రవేశిస్తారు.

ఇదేకాదు, ఆ బొమ్మల అవయవ రూప రేఖా విలాసాలూ, యింపుసొంపులూ కూడా నేర్చుకుంటారు.

కలం పట్టిన ప్రతివాడూ కవికావడం కష్టం. కంఠం వున్న ప్రతివాడూ గాయకుడు కానూలేడు. అలాగే శానం పట్టిన ప్రతివాడూ కానివ్వండి, కుంచెపట్టిన ప్రతివాడూ కానివ్వండి - శిల్పులు కావడంగాని చిత్రకారులు కావడంగాని జరగదు. దీనికి తార్కాణంగా చూడండి :

గాంధీబొమ్మనే ఎంతోమంది చేస్తారు. రానురాను ఆ బొమ్మలు చూస్తే చాలా విచిత్రంవేస్తుంది. గాంధీగారికి

యీ బొమ్మకీ ఏకోశానా పోలికేవుండదు. అలాగే, పులి బొమ్మ చెక్కుతారు. పిల్లిని చూసినట్లే వుంటుంది. ఎవరి పిచ్చి వారికి ఆనందంగా వుండవచ్చు. కాని, అందరికీ ఆనందం కలిగించదనేది నిర్వివాదం.

దీనికి కారణం ఏమిటి ? శిల్పంలో తనకు కావలసిన పద్ధతిని బాగా అర్థంచేసుకోలేదన్నమాట. కారణం, అనుభవశూన్యత్వం – అశ్రద్ధ.

తెలుగునాడులో అక్కడక్కడా కర్రతో రకరకాల బొమ్మలు, ఆటవస్తువులూ చేసుకు అమ్ముకొని పొట్టపోసుకునేవారు వున్నారు. కాని, ఈ బొమ్మలను చూస్తే వింతగా వుంటుంది. ఆఖరికి యిద్దరు పసిపిల్లలు కూడికూడా ఆ రకం బొమ్మలను హేళనచేయడం చూశాను.

దసరాపండుగలకు ముఖ్యంగా మద్రాసులో బొమ్మల కొలువులు అని పెడ్తారు. ఈ బొమ్మలకొలువు మద్రాసులో చాలాబాగా వుంటుంది. బొమ్మలను సర్దడంలో అలంకరించడంలో బాలలు వారి వారి కళానైపుణిని అక్కడ చూపించడానికి తాపత్రయపడతారు.

ఆ బొమ్మలకొలువులో – యావత్తు దినచర్యలూ, కుటుంబ జీవనవిధానాలూ, ప్రకృతిశోభ ,చూపించడానికి వారి తెలివితేటల్ని, కళాపటిమను ప్రదర్శిస్తారు.

అంతటి విలువను యిస్తారు బొమ్మలకు. అటువంటి సమయంలో పిల్లలు ఏన్నో చర్చిస్తుంటారు. ఆ సమయంలో పసిహృదయపులోతులను అర్థంచేసుకోడమే కష్టం.

ఒక శిల్పి యిద్దరు ద్వారపాలకుల బొమ్మలను చెక్కాడు - వాటికి రంగు వేశాడు. వారికి వేసిన దుస్తులు కాకీవి. మొలలో కత్తి, కాలికి జోడు—బాగానే వుంది. దీనిని చూసిన పసిపాపలు యిద్దరు యిలా అనుకుంటున్నారు.

"దొంగలూ వాళ్లూ రాకుండా ఈ బొమ్మలు కాపలా అన్నమాట?"

"అవును. కండలుతిరిగి కత్తిపుచ్చుకుని పోలీసుల్లాగా వున్నారు.

ఇంతలో ఒక బాలుడు "పాపం! ఒక కాపలావాడికి చెయ్యి వంకరగా వుందిరా" అని అన్నాడు.

"ఏదొంగలో కొట్టివుంటారురా"... అని రెండోవాడు అంటున్నాడు.

దీనినిబట్టి ఏం అర్థమౌతూంది ? బొమ్మలు తయారు చేయడంలోవుండే వంకర్లు పిల్లల హృదయాలలో రక రకాల వంకరటింకర భావాలను రేకెత్తిస్తాయనేది. ఉలిపుచ్చుకొని చెక్కగానే కర్రబొమ్మ కానేరదు. అందుకు కొంత తెలివి, శిల్పనైపుణ్యం అందుతో పాటు పిల్లల మనో భావాలను అర్థంచేసుకొనడం కూడా తెలిసివుండాలి ఆ బొమ్మలను తయారుచేసే శిల్పికి.

బొమ్మలు తయారుచేయడం అంటే కర్రను చెక్కి యివ్వడంలో - రెండుచేతులూ సమానంగా వున్నాయా, కళ్లు సరిగా కుదిరాయా, చెవులు తేడాగా లేవుకదా, ముక్కుకు తగ్గనోరు, నోటికిదిగ్గ గడ్డం, పేటికి అన్నిటికీ తగిన

పెద్దదీ చిన్నదీ కాకుండా ముఖం, తల - ఈ ఆకారాలకు తగిన ఒడ్డూ పొడవు యివన్నీ ఉన్నప్పుడే ఆ బొమ్మలో జీవత్వం తొణికిసలాడుతుంది. వాటికి తగ్గట్లు వస్తువులకు బంగారు రంగు, పెదిమలకు ఎరుపు, జుట్టుకు నలుపు, కాలిజోడుకు జేగురురంగు, దుస్తులకు రంగువేయడంలోకూడా శిల్పి తన శిల్పనైపుణ్యంతోపాటు ఆర్టిస్టిక్ కెపాసిటీనికూడా చూపించవలసివుంటుంది.

అంత శ్రద్ధ, పట్టుదల, ఓపిక కనబరచి కనుక ఏబొమ్మ అయినాచేస్తే చూసిన ప్రతి బాలహృదయం - ఒక్కసారి ఆ బొమ్మను పలుకరించకుండా వుండలేదు. అప్పుడప్పుడు బొమ్మలకు అన్నంపెట్టి, జోకొట్టడం చేస్తూంటారు- మరి ఆ బొమ్మలు ఒకవేళ పసిబాలలతో వారి భాషలో మాట్లాడతాయేమో - ఎవరికెరుక !

బాలలకు కథలు రాయడం, పాటలు రాయడం ఎంత కష్టమో, బాలల మనోభావాలకు అభిరుచులకు తగిన రూపాలంకారాలలో బొమ్మలు తయారుచేయడంకూడా అంతేకష్టం.

అంతటి కష్టమూ, శ్రమతో కూడినదీ, తెలివికీ నైపుణ్యానికీ ముఖ్యమయిందీ అయిన ఈ బొమ్మలతయారీలో అందెవేసినవారుగా కొండపల్లివారిని చెప్పవలసివుంటుంది.

పాశ్చాత్య శిల్పకారులనే మీ ప్లాస్టిక్ మాయ బొమ్మలకూ మాకూ తేడాచూడండి అని వెక్కిరిస్తున్నాయా

అన్నట్లు, పలుకరించాయా అన్నట్లు జీవకళతో ముగ్ధులను జేశాయి మన కొండపల్లి కొయ్యబొమ్మలు.

## కొండపల్లి శిల్పుల చరిత్ర:-

ఆంధ్రలో కొండపల్లి శిల్పులు ఆర్యక్షత్రియులని పిలువబడుతున్నారు. వీరు ఎక్కువగా కొండపల్లిలోనే వున్నారు. ఆ కొండపల్లి. ఆంధ్ర రాజకీయ ప్రధాన నగర మనదగిన విజయవాడకు సుమారు ౧౦, ౧౫ మైళ్ళ దూరంలో వుంది. ఇచట చరిత్రప్రసిద్ధిబడసిన కోట ఒకటి వుందికూడా.

ఈ కొండపల్లి ఆర్యక్షత్రియులే రానురాను ఆచరణ లేకనైతేనేమి, సంపాదన సన్నగిలి జీవనం కష్టమవడం మూలంగానైతేనేమి, ౧౬౦౦ శతాబ్దంలోనే అనేక ప్రదేశాలకు వలసవెళ్ళినట్లుగా తెలుస్తూంది.

ఈ కొండపల్లి శిల్పులలో చిత్రలేఖనం కూడా చాలామందికి బాగా తెలుసు. దానికి తార్కాణమే కొయ్య బొమ్మలకు వేసేరంగు నగిషీ పనితనంలో మనకు కనుపించే ఆర్టిస్టిక్ టాలెంట్స్.

ఈ బొమ్మలు తయారుచేసేవారిని - కొండపల్లి ప్రాంతంలో నక్షాలనీ, ఉభయగోదావరి జిల్లాలలోనూ, విశాఖమండలంలోనూ పేరిని ముచ్చివారనీ లేక జీనిగర్లనీ వ్యవహరిస్తున్నారు. అలాగే రాయలసీమ ప్రాంతాలలో వీరిని చిత్తారీలని పిలవడం వ్యవహారంలో వుంది.

వీరి మూలపురుషుడు ముక్తాముని అని చెబుతారు. ఆయన మహాశిల్పి, చిత్రకారుడు — అందుకుతోడు ప్రజల మనోభావాలను ఆకళించుకున్న జ్ఞాని.

వీరిలో బంగారుపని చేయడంలోనూ, చిత్రలేఖనం లోనూ మంచి పనితనంగల నేర్పరులు చాలామంది వున్నారని కూడా వినికిడి.

పూర్వకాలంలో వీరు కొండపల్లి బొమ్మలు తయారు చేయడంతోబాటు సహకారవృత్తిగా — జమీందార్లూ, ధనవంతులూ, మహారాజులూ, భోజనంలో వుపయోగించే కుందనపు రేకులనుకూడా తయారుచేస్తూండేవారుట. అదే కాదు — ఒకప్పుడు మనదేశంలో ఎక్కువ ప్రచారంలో వున్న దశావతార అనే పేకను తయారుచేయడంలో చాలా నేర్పరులుగా వుండేవారుట.

ఈ కొండపల్లి శిల్పులలో చాలాగొప్ప శిల్పకారులు వుండేవారనీ, వారిచేతనే ఆంధ్రదేశంలో అనేక దేవాలయాలలో వాహనాలూ అవీ చెక్కించారనీ, ఇప్పటికీ ఆశిల్పకారులు చెక్కిన వాహనాలు వున్నాయని చాలామంది చెబుతారు.

నందివాహనం, గరుడవాహనం, ఎలుకవాహనం మొదలగు వాహనాలు చెక్కడంలో జీవకళ ఉట్టిపడేలా పనితనం చూపేవారుట. నందిని చూస్తూంటే—ఆ కొమ్ములూ, గంగడోలూ, కండలుతిరిగిన శరీరసుభుపులూ, చూపులో భీకరత్వం కనిపించేలా తీర్చిదిద్దేవారుట. నిజమే... యిప్పటికీ కొన్నికొన్ని దేవస్థానాలలో వాహనాలు చూస్తుంటే చాలా సొంపుగా కన్నులకింపుగా వుంటాయి.

అంతటి శ్రద్ధా, పనితనం చూపారు కనుకనే ఈనాటికీ ఆ శిల్పులను గురించి చెప్పుకొంటున్నాము - తలచుకుంటున్నాము.

అక్కడక్కడ కొన్ని కొన్ని దేవస్థానాలలో కొంత మంది వాహనాలు చెక్కడం చూశాను. తూర్పుగోదావరి జిల్లాలో ఒకచోట వినాయకునిగుడిలో వినాయకుని ఊరేగింపుకోసమని ఎలుకవాహనం చేయించారు. చివరకు దానిని ఆలయంలో పెట్టారు. అక్కడచేరిన భక్తులందరూ వింతగా చూస్తున్నారు. పిల్లలు మరీవింతగా చూస్తున్నారు.

పిల్లలు కొందరు - అది ఎలుక కాదురా - పంది - అంటున్నారు. ఈమాట వింటే చాలా ఆశ్చర్యం వేసింది.

కారణం ఏమాత్రం ఆకారంలో తేడా కనిపించినా పిల్లలు యిట్టే పట్టేస్తారు. యిలా ఎన్నో చోట్ల వున్నాయి. వీరందరూ శిల్పమనే అనుకుంటారు.

కాని, వారికీ ఈ కొండపల్లి శిల్పులకూ ఎక్కడ పోలిక చెప్పండి ?

## బొమ్మలుచేయు విధము :

కొండపల్లి కొయ్యబొమ్మలలో దేవతా సంబంధమైన బొమ్మలనుంచి - సాధారణ ఆటబొమ్మలవరకూ చేస్తారు. .

కొండపల్లి పరిసరాలలో ఎక్కువగా దొరికే పొణికి కర్రను వీరు ఈ కొయ్యబొమ్మల తయారీకి ఉపయోగిస్తారు.

ఈ కర్ర మంచి జిగికలిగి మరీ వుంటుంది. తేలికగా కూడా వుంటుంది.

ఈ పొణికకర్రనే వీరు యీ బొమ్మల తయారీకి ఉపయోగించుకోవడంలోగానీ, ఎన్నుకొనడంలోకానీ ప్రత్యేక ఉద్దేశం – ఆ కర్ర చెక్కడానికి సులువు. కొయ్యడానికి అనువుగా, రంగుపూతకు అనువుగావుండడము – అందుతో బాటు చౌకగా ఎక్కువగా దొరకడం కారణమయి వుంటుంది.

ఈ పొణికకర్రను తీసుకువచ్చి ముందర ఎండలో వేసి పూర్తిగా ఆరపెడ్తారు. తర్వాత ఆ పెద్ద కర్రను కావలసిన పద్ధతిలో చిన్న చిన్న ముక్కలుగా చేసుకుంటారు.

అలా చేసిన ముక్కను తీసుకుని – ఏ ఆకారం కావాలో – అలా జాగ్రత్తగా ఆ ముక్కకు ముక్కు, నోరూ, చెవులూ, కాళ్ళూ, తలా – అలా ఒక్కొక్క అవయవమే చెక్కుకుంటూ రూపకల్పనచేస్తారు. ఆ కర్ర ముక్క చెక్కగా చెక్కగా చివరకు ఒక ఆకారంలో తయారౌతుంది. కాని దుస్తులు తొడగని పాపలాగా బోడిగానే వుంటుంది– అలా చెక్కిన కర్రబొమ్మ.

ఆ బొమ్మకు కుంచెతో రంగులు వేయడం ప్రారంభిస్తారు. ఈ రంగులు వీరే స్వంతంగా తయారుచేసుకుంటారు. ఇంగిలీకము, జేగురు, నీలిమందు మొదలగు పదార్థములతో సుద్దనుకలిపి కావలసిన రంగులు – ఎరుపు, పసుపు, నలుపు, ఆకుపచ్చ మొదలగు రంగులను తయారుచేసుకుంటారు.

స్త్రీ విగ్రహాలకూ, దేవతా విగ్రహాలకూ, బంగారు వస్తువులూ జరీపంచ అలంకరణాలుండేచోట- బంగారురంగు రావడానికి బంగారురంగుగలపొడి సున్నితంగా ఆ యా చోట్ల అద్దుతారు.

బొమ్మకు రంగువేయడం - అందులోనూ కన్నూ, తలా, దుస్తుల్లాంటిచోట్ల చాలా సున్నితంగా, ఓపికతో శిల్పచాతురితో వేయవలసివుంటుంది.

కొండపల్లి బొమ్మలలో మనకు అంత అందం, ఆకర్షణా కనిపించడానికి జీవకళ కనిపించే ఆ యా శిల్పుల పనితనమే.

వీరు ఎక్కువగా తయారుచేయు బొమ్మలలో ఏనుగ, ఏనుగ అంబారీ, పాలకీ, పక్షులు, జంతువులు, ఉయ్యాల, కలువ, అందులో లక్ష్మీరూపం, సరస్వతి, తాడిచెట్టు ఎక్కి కల్లుగీస్తూన్న దృశ్యం, రైతు, కూలీ, పోలీసు, బడిపిల్లవాడు, స్త్రీమూర్తి, ఆవు, బండి, దేవతా విగ్రహాలు, దశావతారపు సెట్టు, రాధామాధవులు, మొదలుగాగల అనేక విధములయిన బొమ్మలు-మనజాతి జీవనానికి సంబంధించినవి- భక్తిపరమైనవి - ఎన్నో తయారుచేస్తారు.

వీటిని ఏ బొమ్మల కొలువులోనో, ఏ ఆఫీసు రూములోనో, ఏ కుర్రవాని చేతిలోనో చూస్తే చాలా ఆనందం కలుగుతుంది. ఈ బొమ్మలముందు-క్రిందపడితే బ్రద్దలయేవీ, నిప్పులో పొరపాటునపడగానే అరసెకనులో బొగ్గు అయేవీ, విరిగిన ముక్కలు కాలిలో గుచ్చుకుంటే సెప్టిక్ అయేవీ అయిన పాశ్చాత్య తయారీఅయిన ప్లాస్టిక్ బొమ్మలు

ఎందుకో అనిపిస్తుంది. అంతటి ప్రాచీన చరిత్ర, గౌరవం, ఖ్యాతివున్న ఈ కొండపల్లి కొయ్యబొమ్మల శిల్పులలో చదువుకున్నవారు తక్కువ, జీవనానికి సరిపోయే డబ్బున్న వారు తక్కువ. అందుకుతోడు నేడు ఈ చేతి పరిశ్రమకు ఆదరణా, పోషణా లేదు. ఈ పరిస్థితులలో ఈ వృత్తిని వదులుకుని వేరే పొట్టపోసుకోడం కోసం యితర మండలాలకు, చివరకు రాష్ట్రేతర ప్రదేశాలకు వలస వెళ్ళిపోతున్నారు. రానురాను ఈ కళలో పనితనంవున్న వ్యక్తులే కనుమరుగైపోయే పరిస్థితి కనిపిస్తూంది.

అలాటి దుస్థితి రాకుండానే దీపంవుండగానే యిల్లు చక్కపెట్టుకోవడం మంచిది. అందుకు అధికారంలోవున్న నాయకులూ, అనధికారులైన శిల్పాభిలాషులూ, పత్రికల వారూ ఈ పరిశ్రమ పురోభివృద్ధికి, పునరుద్ధరణకు పూను కుంటారని సహాయపడతారని ఆశిస్తాను.

జాతీయాభిమానంతో కానీయండి, మన చేతి పరిశ్రమ అన్న అభిమానంతో కానీయండి, లేదా చౌకగా చాలాకాలం మనగలిగిన కర్రబొమ్మలన్న ఆలోచనతోగానీ యండి – ఏదో అభిమానంతో కొండపల్లి బొమ్మలు విరివిగా కొనడం, బహుమతులకు వీటినే ఇవ్వడం, ఇంటిలో అలంకారాలకు వీటినే ఎన్నుకోవడం చేస్తే, అడుగంటుతున్న ఈపరిశ్రమనూ పునరుద్ధరించినట్లు అవుతుంది. ఆదరణ లేక ఆకలితో అలమటించే ఆ శిల్పులకూ నాలుగు డబ్బులు యిచ్చినట్లు ఔతుంది.

బాలల్లో ఈ బొమ్మలు ఎంతో విజ్ఞాన ప్రబోధాన్ని

సంతోషపూరితమనోభావాల్ని కలిగించగల ఆకారాలు రంగుల యింపులూ వున్నాయి.

ఈలాంటి కుటీర చేతిపరిశ్రమలకు స్త్రీ సంక్షేమ శాఖ, జాతీయవికాస కేంద్రాలు ప్రభుత్వపరంగా కొంతలో కొంత సహాయపడాలనే తలంపుతో, పునరుద్ధరించాలనేతలంపుతో, ప్రోత్సహించాలనే దివ్యాశయంతో పనిచేస్తున్నాయి.

కాని, ఈ సహకారం, సహాయం, ప్రోత్సాహం చాలదు. అన్ని వైపులనుంచీ అన్నివిధాలా జరగాలి. అప్పుడే కొడిగట్టుతున్న దీపం దేదీప్యమానంగా దివ్య జ్యోతులీనుతుంది.

ఈవిధమయిన రకరకాల బొమ్మల కళ ఎలా దేశ ప్రజల్లో [illegible]గా బాలల్లో ఎలా ప్రచారమవుతూ వారి భావాలను ఆకర్షిస్తూందో చూస్తున్నాం.

రకరకముల ఆకారాలలో, వింత వింత రంగులలో- వున్న బొమ్మలను చిన్నతనంలో ఆడుకొనడం మూలంగా సృజనాత్మకశక్తి జాగరితమైన కళాకారుడెవడైనా నవీన పద్ధతిలో కొండపల్లి బొమ్మలను తయారుచేసిన కళారూపాన్ని చూసి ఏనాడో ఒకనాడు భారతదేశమే......ఆఖరికి ప్రపంచమే పరవశం చెందగలదేమో - ఎవరు చెప్పగలరు !

